# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ (e) మాసపత్రిక




ఫిబ్రవరి 2012

కొత్తపల్లి-తెలుగుపిల్లల ఈ (e) మాసపత్రిక ఫిబ్రవరి 2012

**మూలం:** **http://kottapalli.in/2012/02/welcome**

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'దూర దర్శనం':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

**ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in**




# విషయ సూచిక

# బాబోయ్, టి.వి!



"అనగనగా వెంకటాపురం అని ఒక ఊరు ఉండేదట. అది పూర్వకాలంలో పచ్చని పంటలతో హాయిగా ఉండేదట. ఈ కాలంలోనైతే ఎన్నో కొత్తవి కనిపెట్టారట వాళ్ళు- రేడియో, టివి, బైక్, కార్ మొదలైనవి. అయితే ఆ వూళ్ళో చాలామంది ముఖ్యంగా టివి వల్ల చెడిపోయినారట- ఎల్లాగ అంటే, ఆ ఊళ్ళో రవి అనే పిల్లవాడు ఒకడు ఉండేవాడు. ఆ బాలుడికి మంచి విజ్ఞానం ఉంది. ఇష్టంగా చదువుకునేవాడు; చక్కగా మంచి మార్కులు తెచ్చుకునేవాడు (-ఇవన్నీ వాళ్ల ఇంటికి టి.వి. రాకముందే). వాళ్ల ఇంటికి మరి టి.వి. ఎలా వచ్చిందంటే, రవికి ఒక చిన్న తమ్ముడు ఉన్నాడు-శివ. ఆ శివకు ఒక స్నేహితుడు ఉన్నాడు. వాడి పేరు రాము. రాము వాళ్ళ ఇంట్లో టి.వి. ఉంది. రోజూ శివకు తను ఇష్టంగా చూసే టి.వి.ప్రోగ్రాముల గురించి చెబుతుండేవాడు. శివకు కూడా వాటిని చూడాలని ఒక కోరిక కలిగింది. వాళ్ళ నాన్నమీద ఎంతో ఒత్తిడి పెట్టాడు. చివరికి వాళ్ల ఇంటికి టి.వి. రాక తప్పలేదు. శివ తన మిత్రుడు రాము చెప్పిన ప్రోగ్రాంలు చూస్తూండేవాడు. క్రమంగా రవికి కూడా ఆ వ్యాధి సోకింది. వెంటనే తన చదువు పోయింది! రాత్రులు పన్నెండు గంటలవరకు టి.వి. చూడటం, ఉదయం లేట్ గా లేవడం, సోమరిలాగా తయారు కావటం! చూస్తూండగానే రవికి పరీక్షలలో మార్కులు తగ్గాయి. వాళ్ల ఉపాధ్యాయులు అందరూ ఆశ్చర్యపోయారు: అతనిలో ఇంత మార్పు రావటంతోఅందరూ అతని గురించి రకరకాలుగా ఊహించుకున్నారు. కొంతమంది

వాడు ఎక్కువగా ఆడుతున్నాడేమో అనుకునేవాళ్ళు. కొంతమంది వాడు ఎక్కువగా నిద్రపోతున్నాడేమో అనుకునేవాళ్ళు. కానీ అసలు విషయం ఎవ్వరికీ తెలియదు- తను టి.వి. చూస్తున్నాడని. తరువాత కొంతకాలానికి రవి పూర్తిగా టి.వి.మాయలో పడిపోయాడు. టి.వి.లో తనకు ఇష్టమైన ప్రోగ్రాం రాకపోతే ఏడ్చే పరిస్థితికి వచ్చాడు. చివరికి వాళ్ల నాన్న సమస్యను అర్థం చేసుకొని, టి.వి.ని తీసుకెళ్ళి అమ్మేశాడు. 'టి.వి. పోయింది' అనే బాధ రవిని బాగా పీడించింది, కొన్నాళ్ళు. తర్వాత వాడు దాని గురించి మరచిపోయి మళ్ళీ హాయిగా తన పాత లక్షణాలకు తిరిగి వచ్చాడు. టి.వి. మనిషిని ఎన్ని ప్రమాదాలకు గురిచేస్తుందో చెప్పలేము" అని రాస్తున్నాడు, కుంచనపల్లి అరవింద స్కూలు నుండి 8 వ తరగతి యోగి!

అమ్మానాన్నలు టి.వి.లను అమ్మేస్తే పిల్లలకు దానిమీద కోరిక మరింత ఎక్కువైపోయే ప్రమాదం లేదూ? అందుకని, ఈ సమస్యకు అసలు మందు 'అర్థం చేసుకోవటంలోనే' ఉన్నది. పరీక్షలు దగ్గరపడుతున్నై; అందుకని టి.వి. చూసే అలవాటును తగ్గించుకునే ప్రయత్నం చెయ్యాలి పిల్లలందరూ. టి.వి.లు, కంప్యూటర్లు, సెల్‌ఫోన్లు- వీటిని విజ్ఞానాన్ని ఇచ్చే సాధనాలుగా వాడుకోవాలి తప్ప, ఎవ్వరూ వీటి ఆకర్షణలో పడిపోకూడదు. ఈ విషయంలో చైనా, జపాన్ దేశాల పిల్లలు మనకు ఆదర్శం కావాలి. వాళ్లలాగా మనమూ ఈ వస్తువులు ఎలా పనిచేస్తాయో తెలుసుకొని, వీలైతే వాటిని మరింత నేర్పుగాను, ఉపయోగకరంగాను తయారు చేయటం నేర్చుకోవాలి.

ఇంతకూ టి.వి. ఎలా పనిచేస్తుందోతెలుసా? అందులో ఏమేం ఉంటాయి? టి.వి. తయారు చెయ్యాలంటే అసలు ఏమేం కావాల్సి వస్తాయి? మరి సెల్ ఫోన్ లోపలి భాగాల్ని ఎలా తయారు చేస్తారు? ఏభాగం ఏం పని చేస్తుంది? పెద్దప్రశ్నలే, సమాధానాలు కనుక్కోండి మరి!

అందరికీ అభినందనలతో,

కొత్తపల్లి బృందం



# నీతి చంద్రిక

విగ్రహం-4

*జరిగిన కథ: పక్షులన్నీ కలిసి కొంగ తీరును విమర్శిస్తూ 'కుందేళ్ళు-ఏనుగుల' కథ చెప్పటం మొదలెడతాయి. కరువుతో అల్లాడే ఏనుగులకు మంచినీళ్ల సరస్సు ఒకటి దొరకగానే, అవన్నీ అందులోకి దూకుతాయి... ఇక చదవండి, నీతి చంద్రిక 28 వ భాగం.*

*మూలం: కీ.శే.కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

ఏనుగులు ఇలా కొత్తగా కనుగొన్న చెరువుకు దగ్గరలో చాలా కుందేళ్లు నివసిస్తూ ఉండేవి. శిలీముఖుడనే కుందేలు వాటికి రాజు, రోమకర్ణుడు అతని మంత్రి. ఏనుగుల గుంపు తమకు కనబడ్డ దారిలో చెరువు వైపుకు పరుగులిడుతున్న సమయంలో వాటి పాదాల క్రింద పడి అనేక కుందేళ్లు పాపం, నలిగి, చచ్చిపోయాయి! వాటిని చూసి మంత్రి రోమకర్ణుడి మనస్సు దు:ఖంతో పరితపించి-పోయింది.

అది భయపడుతూ, రొప్పుతూ, రోజుతూ, పరుగు పరుగున శిలీముఖుడి దగ్గరికి వెళ్ళింది.

రాజుగారికి వినయంగా నమస్కరిస్తూ, అది తమ వారికి ఎదురైన ఆపద గురించి చెప్పబోయింది- కానీ దు:ఖంతో దాని గొంతు మూసుకుపోయింది. మాట్లాడలేనట్లు అది కొంతసేపు తలవంచుకొని నిలబడి, చివరికి తెలివి తెచ్చుకొని "ప్రభూ! తమరు చూశారో, లేదోగాని, ఏనుగుల గుంపుల వల్ల మన కుందేళ్లకు ప్రళయమే ఎదురయినట్లున్నది!" అన్నది.

భయంకరమైన ఆ పలుకులు శిలీముఖుడి చెవులలోకి దూరి ఆతని హృదయాన్ని ముక్కలు ముక్కలు చేశాయి. అప్పుడది చేతులతో చెవులు మూసుకొని, 'హరి హరీ' అంటూ కళ్లు మూసుకొని, కొంతసేపు బొమ్మలాగా నిలబడిపోయింది. మంత్రి ప్రయత్నం వల్ల కొంతసేపటికి అది తెలివి తెచ్చుకొని, నిట్టూర్చుతూ అన్నివైపులా చూసింది. అటుపైన మెల్లగా లేచివచ్చి, 'జరగవలసిన పని ఏమా' అని ఆలోచిస్తూ, చెంతనిలబడ్డ మంత్రులందరినీ చూసి ఇట్లా అన్నది:

"ఈ ఏడాది వేసవి వేడివల్ల అడవి అందం అంతా చెదరిపోయింది. అన్ని చోట్లా వాగులు, వంకలు ఇంకబట్టాయి. దాంతో దాహం ఎక్కువైపోగా, మనసులు అల్లకల్లోలమై పోగా, ముఖాలు వాడిపోగా, ఏనుగుల గుంపులు నడిచివచ్చే కొండల మాదిరి బయల్పడ్డాయి. ఇప్పుడు అవి 'ఈ నేల మొత్తం యీనిందా' అన్నట్లు, అన్ని చోట్లా తామే అయి, పరుచుకొని ఉన్నాయి. వాటి పాదాల క్రింద పడి నలిగి చనిపోయిన మన కుందేళ్ల సంగతి విన్నప్పటి నుండీ నా మనస్సు తీవ్ర ఆందోళనకు గురవుతున్నది.



దాహంతో ఈ ఏనుగుల మనస్సులు పూర్తిగా అదుపు తప్పి ఉన్నాయి. మత్తెక్కిన ఈ ఏనుగుల గుంపుల్ని మనం ఇలా ఎల్లప్పుడూ నీళ్లు త్రాగేందుకని రానిస్తూ-పోనిస్తూ ఉంటే, త్వరలో మన గుంపులో ఇక ఎవ్వరూ మిగలని స్థితి వస్తుంది. అందరం ప్రాణాలు కోల్పోయి, మన జాతి మొత్తం కేవలం పేరుకే పరిమితమై పోతుంది. మనవాళ్లు ఇప్పటికే చాలామంది చనిపోయారు. సముద్రం మాదిరి అఖండంగా ఉండే మన బృందం ఇప్పుడు ఆవు గిట్ట ఆకారంలోకి వచ్చేసింది. ఇంకా ఆలస్యం చేస్తే వినాశనమే. అయితే మనం ఏం చేయగలం? మనం బలహీనులం- అంత పెద్ద ఏనుగులను ఎదిరించేంత బలం మనకు లేదు. ఏం చెయ్యాలి ? ఎట్లాగైనా యీ ఏనుగుల సమస్యకు తగిన ఉపాయాన్ని త్వరగా కనుగొనాలి!" అన్నది.

అదివిని మంత్రుల మనసులన్నీ విషాదంతోటీ, ఆశ్చర్యంతోటీ ముడుచుకు పోయినై. వాటికి ఏమీ తోచలేదు. అవన్నీ అలా ఒక దాని ముఖం ఒకటి చూసుకుంటూ 'ఈ సమయంలో మనకు దేవుడేదిక్కు-వేరే ఏమీ చేయలేం' అని దు:ఖ పడుతూ ఉండి-పోయాయి.

ముఖాలు తెలివి తప్పి, అవన్నీ అలా చేష్టలు ఉడిగి ఉండగా, 'విజయుడు' అనే ముసలి కుందేలు ఒకటి ముందుకు వచ్చింది.



అది శిలీముఖుడితో- "మహాప్రభూ! తమరు చింతించకండి. 'ఇది ఒక పని ' అని కూడా భావించకండి; మనసును కష్టపెట్టుకోకండి. ప్రభువుల దయ నా మీద ఉంటే, నాకు యీ శత్రువులను ఓడించటం ఎంత పని? ఈ

ప్రపంచంలో 'తెలివితేటల వల్ల సాధ్యంకానిది' అంటూ ఏమీ లేదు. శరీర బలం లేకపోయినా సరే, తెలివితేటలు ఉన్నవాడు ఏ పనినైనా అలవోకగా చేయగల్గుతాడు. దేశకాలాల గురించిన తెలివి ఉండి, ఎల్లప్పుడూ ప్రభువులవారి సభలో కొలువు చేసుకునే మావంటి వారికి యీ ఏనుగులను పారద్రోలటం ఏమంత కష్టం కాదు. మీరు కనుసైగతో ఆజ్ఞాపిస్తే చాలు - మీ ఆజ్ఞాబలంతో ఎంతటి పనినైనా అతి సులభంగా సాధించుకొని రాగలడు- మీ యీ దాసానుదాసుడు!" అన్నది.

అది విన్న కుందేలు రాజుకు దాని మీద చాలా అభిమానంకలిగింది. చల్లనైన చూపుల్ని దానిపై ప్రసరింపజేస్తూ, 'సరే' అన్నట్లు మొలక నవ్వులు చివురిస్తూ , తల ఊపింది అది- "వెంటనే వెళ్లి పనిని సఫలం చేసుకొని రా, నీ కోరికకు దైవం కూడా అనుకూలించు గాక!" అని దీవించింది.

అప్పుడా ముసలికుందేలు 'మహా ప్రసాదం' అని రాజుకు మ్రొక్కి బయలుదేరి పోయింది.

అలా పోతూ, దారి మధ్యలో అది ఇలా అనుకున్నది- "చూడు, ఆ ఏనుగుల రాజు చాలా పెద్దది. నేనేమో చాలా చిన్న దానిని. ఆ ఏనుగును కలసి మాట్లాడటం అనేది నాకు ఎట్లాసాధ్యం? ఒకవేళ ఎట్లాగోఒకలాగా సాధ్యమే అయ్యిందనుకో- అయినా పని ఎట్లా నెరవేరుతుంది? నేను అందని మామిడిపళ్లను కోసుకోనెంచినట్లున్నదే; నా కోరిక నెరవేరుతుందో, నెరవేరదో!" అని. అలా కొంతసేపు దాని మనసు ఆ ఆందోళనతో ఊయలలూగాక, చివరికి దానికి ఒక చక్కటి ఉపాయం స్ఫురించింది.

అది ఆ ఆలోచననే కొంతసేపు జాగ్రత్తగా గమనించి, 'ఉపాయం బాగుంది. పనికి సరిపోతుంది' అని మనసుకు సమాధానం చిక్కాక, ఇక ఉత్సాహంగా ముందుకు సాగింది- "స్పర్శచేత ఏనుగు, వాసనచేత గుర్రం, పరిపాలన చేత రాజు, నవ్వుతో దుర్మార్గుడు ఇతరులను గెలుస్తారట- కాబట్టి నేను ఈ కొండ కొమ్మున ఎక్కి కూర్చొని, ఏనుగుల రాక కోసం వేచి చూస్తాను"

అనుకున్నది.

ఇక ఆ ఏనుగుల రాజు తన సహచరు-లందరితోటీ వచ్చి చెరువులోకి దిగి, ఆటలాడి, నీళ్ళు త్రాగి, మళ్ళీ వెనక్కి మరలి బయటికి రాగానే కొండ కొమ్మున కూర్చున్న ఆ కుందేలు గట్టి గొంతుతో "ఓ ఏనుగురాజా! నీకు అంతా మేలగు గాక! ఒక్క క్షణం అలా నిలచి నేను చెప్పే నాలుగు మాటలూ విని పో!" అన్నది.



అప్పుడు ఆ ఏనుగులరాజు ముఖంపైకి ఎత్తి చూసి "ఎవడివి నువ్వు? మాతో నీకు ఏం పని? ఎందుకు మాట్లాడవచ్చావు? సమయాన్ని వృధా చేయక, నీ కథనంతా ఒకటి రెండు ముక్కల్లో వివరించు! వెళ్ళాలి" అన్నది.

అప్పుడు ఆ కుందేలు ధైర్యం తెచ్చుకొని, గంభీరమైన గొంతుతో అన్నది- "ఎవ్వరి పేరు వినగానే శత్రు సమూహాలు ఎల్లప్పుడూ తల్లడిల్లిపోతాయో, భూమికంతటికీ ఏకైక అధినాధుడెవ్వడో, ఆ నెలరాజు చంద్రుడి దూతను నేను! 'శత్రువుకు అంతులేని కోపం వచ్చి, చేతిలో కత్తి పట్టుకొని ప్రాణాలు తీసేందుకు మీదికి దూకిన సమయంలోకూడా, దూత అన్నవాడు కొంచెం కూడా భయపడక, మాట మ్రింగక, వాస్తవాన్నే చెప్పాలి'- కాబట్టి, దూతగా నా బాధ్యతను నెరవేరుస్తాను. రాజా! రాత్రికి అధిపతియైన మా మహారాజు తమంతట తాముగా నీతో చెప్పవలసిందిగా నాకు చెప్పిపంపిన సమాచారం కొంత ఉన్నది; చెబుతాను- శ్రద్ధగా వినవలసినది:

"ఈ సరస్సు నా ఆధీనంలోఉన్నది. అందువల్ల మంచి నీటితో నిండిన ఈ సరస్సులోకి నా అనుమతి లేకుండా ప్రవేశించేందుకు ఎంతటి భీమబలులైనా

జంకుతారు. మీరు నన్ను లక్ష్య పెట్టకుండా, 'ఇవాళ్ళ-రేపు' అనే జంకు లేకుండా ఈ కొలనులోకి ప్రవేశించారు; మమ్మల్ని చాలా కలతపరచారు.

అంతేగాక, దారి మధ్యలో నా పాద దాసులైన అనేక కుందేళ్ళను రూపుమాపి, నా పట్ల గొప్ప అపరాధం చేశారు మీరు. మీకు బుద్ధిగా బ్రతకాలని ఆశ ఉన్నట్లైతే తక్షణం ఈ మడుగును విడిచి వేరే చోటికి పోండి. ఇది మొదలు మరెన్నడూ నా అనుమతి లేకుండా కొలనులోకిప్రవేశించకండి.

'తెలిసీ తెలియని వారులే, పాపం' అన్న భావనతో ఇంతవరకూ మీరు చేసిన తప్పుల్ని క్షమించాను. ముందు నా ఆజ్ఞను పాటించి ప్రాణాలు కాపాడుకోండి.

అట్లా కాక, గర్వాంధకారంలో కళ్ళుగానక, నా ఆజ్ఞను ఉల్లంఘించినట్లైతే- మిమ్మల్ని అందరినీ నా పరాక్రమాగ్నితో ఒక్కసారిగా భస్మీపటలం చేస్తాను. అటుపైన మీ ఇష్టం!" అని కోపంతో ఎర్రబారి, ప్రళయకాలపు అగ్ని శిఖల మాదిరి మండిపడుతున్నాడు మా రాజు.

అందువల్ల ఇక ఆలస్యం చేయకండి- పరమ దయాళువైన ఆ చందమామను తక్షణం శరణు వేడండి. ఆయన దయకు పాత్రులు కండి" అన్నది. (-మిగతా కథ మళ్ళీ...) ✿

చిట్టి కవిత

**నా పేరేంటి?**

నాపేరు మామిడికాయ

నా ఇల్లు చెట్టు

నా ఊరు మట్టి

నా దేశం భారతదేశం

*రచన: కార్తిక్, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి*

తెలుసుకుందాం!

"మరోప్రపంచం పిలిచింది- పదండి ముందుకు! పదండి తోసుకు పోదాం పోదాం పైపైకి" అని రాసిందెవరు?

జవాబు: మహాకవి శ్రీశ్రీ

చిలిపి ప్రశ్న- తిక్క జవాబు

మనం నీళ్ళు ఎందుకు తాగుతాము?

నీళ్ళని మనం తినలేం కదా, అందుకు!



# ఒక బాతు బాధ

*హైదరాబాదు పుస్తక ప్రదర్శనలో వచ్చి కూర్చొని ఈ బాతుపాప అద్భుతమైన చిట్టి కథ ఒకటి రాసి వెళ్ళింది. ఆ కథని చదువుతున్న మీకూ అభినందనల క్వాక్..క్వాక్!*

*రచన: ఆర్.అలేఖ్య, 8 వతరగతి, సాగరిక హైస్కూల్, సరూర్‌నగర్, హైదరాబాద్.*

ఒక ఊరిలో ఒక బాతమ్మ ఉండేది. ఆ బాతమ్మకు ఒక పాప కూడా ఉండేది. ఆ పాప పేరు పండు.

ఒకరోజు ఒక కాకి ఆకాశంలో ఎగురుతుంటే చూసింది పండు.

తను కూడా దానిలాగా ఎగరాలని అనుకుంది.

ఆ కాకినే చూస్తూ చూస్తూ మెల్లగా దాని వెంటనే వెళ్లసాగింది. కానీ ఎగరలేక పోయింది.

అలా అమ్మకు చెప్పకుండానే ఇల్లు విడిచి చాలా దూరం వెళ్లిపోయింది!

కొంచెం సేపటికి అమ్మ పండు కోసం చూసి,

'ఎక్కడికి వెళ్ళిందో కదా' అని కంగారుగా వెతకటం మొదలుపెట్టింది.

చూస్తే పండు ఎటువైపో నడచుకుంటూ పోతున్నది, పైకిపైకి చూసుకుంటూ.

అమ్మ దాన్ని ఆపి, అవీ ఇవీ చెబుతూ ఇంటికి తీసుకొచ్చింది.

అలా పండు తిరిగి ఇంటికి చేరుకుంది. సమయం చూసుకొని అమ్మ "ఇంతకీ నువ్వు ఎక్కడికమ్మా పాపా, వెళ్ళావు?" అని అడిగింది.

'నేను కాకి వెంట పోయాను. ఆ కాకిలాగా ఎగరలేకపోయాను, ఎంత ప్రయత్నం చేసినా" అంది పండు, విచారంగా.

"మనం బాతులం, పాపా! అందుకని మనం కాకిలాగా ఎగరలేము; ఆ కాకులు మనలాగా ఈదలేవు!" అంది బాతమ్మ.

బాతుపాపకు ఏదో కొంచెం అర్థం అయింది.



**కనుక్కోండి చూద్దాం!**

1. ఒక పచ్చ రంగు తలుపు తెరిస్తే, ఒక గోధుమరంగు తలుపు ఉంటుంది. అదికూడా తెరిస్తే, ఒక తెలుపు రంగు తలుపు ఉంటుంది. అదికూడా తెరిస్తే, ఒక ఈత కొలను ఉంటుంది!! ఏమిటది? ఏమిటది?

2. తిరగేస్తే పెద్దదైపోయేది ఏ అంకె?

3. ఒకటో అంతస్తులో 32మంది తెల్ల మనుషులు ఉన్నారు. రెండో అంతస్తులో రెండు మురికి గదులు ఉన్నాయి. మూడవ అంతస్తులో రెండు తెల్ల గదుల్లో రెండు నల్ల మంచాలు ఉన్నాయి. నాలుగవ అంతస్తులో ఇద్దరు నల్ల రాజులు ఉన్నారు. అయిదో అంతస్తులో ఒక నల్ల అడవి ఉంది!! ఏంటి, ఇదంతా?

*ఆర్య, 4వ తరగతి, రిషివ్యాలీ స్కూల్.*

*(సమాధానాలు 58వ పేజీలో)*



# మారిన మనిషి

*రచన: బి.సతీష్‌కుమార్, 5 వతరగతి, శాంతినికేతన్ విద్యాలయం, జహీరాబాద్.*
*సౌజన్యం: జహీరాబాద్ పిల్లలకథలు, మనలైబ్రరీ, జహీరాబాద్.*

రంగాపురంలో రాముడనేవాడు చిన్నాచితకా దొంగతనాలు చేస్తూండేవాడు. రాత్రివేళల్లో ఇళ్లల్లోకి చొరబడి అందినంత మేరకు దోచుకునేవాడు. అప్పుడప్పుడు పట్టుబడి గ్రామస్థుల చేతుల్లో దెబ్బలు తినేవాడు. జైల్లో ఉంచినా, విడుదల కాగానే దొంగతనాలకు పాల్పడేవాడు.

ఒక రోజు రాముడి కన్ను రాజయ్య మాస్టారి ఇంటి మీద పడింది. ఆయనంటే ఆ ఊరిలో అందరికీ గౌరవం . ఎవరికి ఏ ఆపద వచ్చినా ఆయన్నే సలహా అడిగేవారు. ఊళ్ళో పిల్లలందరికీ పగటిపూట; పెద్దలందరికీ రాత్రిపూట వీధి అరుగు మీదనే చదువు చెబుతుండేవారు ఆయన. వాళ్ళిల్లు ఎప్పుడు చూసినా సందడి సందడిగా ఉంటుంది. ఆ ఇంట్లో దొంగతనం చేస్తే బాగా డబ్బు

దొరుకుతుందని భావించాడు రాముడు.

ఓరోజు రాత్రి వాడు చాకచక్యంగా పెరటిగోడ దూకి, మాస్టారి ఇంట్లోకి ప్రవేశించాడు. చీకట్లోనే ఇల్లంతా తడుముకుంటూ వెదికాడు- ఎక్కడా విలువైన వస్తువులు కానీ, డబ్బుగానీ దొరకలేదు. ఏవో కొన్ని వంటపాత్రలు, అలమారల నిండా పుస్తకాలు తప్ప, వేరేవేమీ లేవు ఆ యింట్లో...రాముడికి ఆశ్చర్యం వేసింది- "ఛ, ఛ. నేను పడ్డ శ్రమంతా వృథా అయిపోయింది" అని తిట్టుకుంటూ బయటికి వెళ్ళబోయాడు. గడపకు ఈవతలే కాలికేదో తట్టుకున్నది- తూలిపడ్డాడు.

ఆ అలికిడికి మేలుకున్నారు మాస్టారు- "ఎవరదీ?" అని దీపం వెలిగించారు. పారిపోదామనుకున్న రాముడు ఆగాడు- "మాస్టారు ఏం చేస్తారులే!" అన్న ధీమాతో "నాపేరు రాముడు. దొంగతనానికి వచ్చాను, ఇంట్లో ఏమీ లేదు. ఎలా బతుకుతు-న్నావయ్యా?!" అన్నాడు అసహనంగా.

మాస్టారు కొంచెం సేపు మాట్లాడలేదు. అటుపైన "ఒక్క నిమిషం ఆగు" అంటూ తలదిండు క్రిందనుంచి పది రూపాయల నోటు తీసిచ్చారు- ప్రస్తుతానికి ఇది ఒక్కటే ఉంది, నీకు పనికొచ్చేది- నెల మొదట్లో వచ్చి ఉంటే కొన్ని ఎక్కువ డబ్బులు దొరికేవేమో" అన్నారు ప్రశాంతంగా.



రాముడు ఆయన చేతిలోంచి ఆ నోటును లాక్కున్నాడు. "ఏమీ వెనకెయ్యలేదా?" అడిగాడు.

"నాకు ఎక్కువ డబ్బు అవసరం లేదు. నలుగురికీ జ్ఞానం పంచుతున్నానన్న తృప్తిచాలు. నేనంటే ఊరి వాళ్లకి చాలా గౌరవం. తెల్లవారుతున్నది- ఇంకొంచెం

సేపట్లో ఎవరో ఒకరు వస్తారు. నిన్నిట్లా చూశారంటే చావబాదుతారు. వెంటనే జాగ్రత్తగా వెళ్లిపో!" అన్నారు మాస్టారు, వాడిని బయటికి నెట్టుతూ.

ఒక్క క్షణం రాముడికి కళ్లంట నీళ్లు తిరిగాయి. "డబ్బుల పరంగా చూస్తే, నిజానికి తన పరిస్థితి మాస్టారికంటే చాలా మెరుగు .. కానీ మాస్టారి బ్రతుకులో నిండా వెలుగు ఉంది- తనది మాత్రం చీకటి బ్రతుకు !"

ఆలోచించిన కొద్దీ రాముడికి సిగ్గు అనిపించింది. "మాస్టారూ! అన్నీ ఉన్నా గౌరవంగా బ్రతకలేకపోతున్నాను. మిమ్మల్ని చూశాక నా తప్పేంటో తెలుసుకున్నాను. ఇకపై దొంగతనాలు చేయను. కష్టపడి బతుకుతాను" అంటూ మాస్టారికి నమస్కరించి, మారిన మనిషిగా ఇంటిదారి పట్టాడు.



నవ్వితే నవ్వండి!

**ఇంద్రజాలం!**

హోటల్లో..

సర్వర్: సార్ సార్... కొంపమునిగింది!

యజమాని: ఏమైంది? ఏమైంది!?

సర్వర్: పీకల్దాకా తిన్నాడు సార్ ఆ మెజిషియన్! అయితే బిల్ ఇవ్వగానే, 'అబ్రకదబ్రా' అని త్రేన్చాడు సార్! మరుక్షణం బిల్‌తో పాటు మాయమయ్యాడు!"

**నేనే పెద్ద!**

టీచర్: శీనా! ఎలిఫెంట్ పెద్దదా.. చీమ పెద్దదా?

శీన: మీరు ముందు వాటి డేట్ ఆఫ్ బర్తులు చెప్పండి- ఆ తర్వాత గానీ ఏది పెద్దదో చెప్పలేను మాస్టారు!



# అడవి రాజ్యం

*ఈమధ్యకాలంలో ఇంగ్లీషు చదివే పిల్లలందరినీ అలరించిన ఏ జంతువుల కథకూ తీసిపోదు ఈ కథ- ఇన్నిన్ని మెలికల ఈ కథని పొడిగిస్తే ఇంకా ఎంత పెద్దదౌతుందో- టివి సీరియల్ అవుతుందేమో మరి!*

*రచన: నాగుల్‌షరీఫ్, 8 వ తరగతి, జాస్మిన్, అరవింద హైస్కూల్, కుంచనపల్లి.*

అనగనగా ఒక అడవి ఉండేది. ఆ అడవిలో అనేక రకాల జంతువులు కలిసి బ్రతుకుతూ ఉండేవి. అడవికి రాజు సింహం- పెద్దవాడయ్యాడు. 'అతని తర్వాత ఎవరు రాజు?' అనేది స్పష్టంగా లేదు- ఎందుకంటే సింహరాజుకు పిల్లలు లేరు.

అయితే సేనాపతి చిరుతపులి రాజు అవ్వాలని ఎంతో కాలంగా కలలు కంటున్నది. సింహరాజు ముసలివాడవ్వగానే అది ఒక పన్నాగం పన్నింది. సింహరాజు అమాయకంగా అందులో ఇరుక్కున్నాడు. వెంటనే అతన్ని తుదముట్టించింది చిరుత. అప్పటినుండీ ఆ అడవికి రాజు చిరుతపులే!

చిరుత పులికి స్వార్థం ఎక్కువ; అంతేగాక దానికి రాజుకు ఉండవలసిన మంచి గుణాలు ఏవీ లేవు. దాని పాలనలో అడవిలోని జంతువులన్నీ ఎన్నో కష్టాలు పడసాగాయి.

అవన్నీ కలిసి ఒకరోజున సింహరాణి దగ్గరికి వెళ్ళాయి. తమ గోడంతా చెప్పుకున్నాయి. తమ బాధలన్నీ విన్నవించుకున్నాయి. అయినా సింహరాణి వాళ్ళకు నేరుగా ఏమీ సహాయం చెయ్యలేదు- "మీకు ప్రస్తుతం మహారాజు చిరుతపులి. మీకు ఏమైనా కష్టాలు ఉంటే ఆయనకే విన్నవించుకోండి" అని మట్టుకు చెప్పగలిగిందామె.

చిరుతపులికి ఇద్దరు మిత్రులు- పెద్దపులి, నక్క. తను రాజు అవ్వగానే చిరుత పులి వాటిని తన మంత్రులుగా పెట్టుకున్నది. జంతువులన్నీ రాణి దగ్గరికి వచ్చి మొరపెట్టుకోవటం విన్నాయవి. వెంటనే ఆసంగతిని చిరుతపులి చెవిలో ఊదాయి కూడా.

చిరుతపులి వెంటనే ఒక సభ ఏర్పాటు చేసింది. ఆ సభలో అది సింహరాణిని దోషిగా నిలబెట్టింది- 'రాజైన తనకు వ్యతిరేకంగా జంతువులను కూడగట్టుతున్నది' అన్న ఆరోపణతో సింహరాణిని కాస్తా బంధించి జైలులో పెట్టింది!

అప్పటినుండీజంతువులకు మరిన్ని కష్టాలు ఎదురయ్యాయి. అవన్నీ నోరు నొక్కుకొని తమ బాధల్ని తాము భరించటం అలవాటు చేసుకున్నాయి.

అయితే అధికారం చెడ్డది- కోరినవారినల్లా చెరుపుతుంది అది! అధికారాన్ని దగ్గరగా చూస్తున్న పెద్దపులి, నక్క రానురాను మరింత దుర్మార్గానికి ఒడి కట్టాయి- ఎలాగోఒకలాగా చిరుతను చంపేసి రాజ్యాన్ని తమ హస్తగతం చేసుకోవాలని పన్నాగం పన్నాయి. కారాగారంలో ఉన్న సింహరాణి ఈ పన్నాగాన్ని గురించి విన్నది. తనను బంధించిందని కూడా తలచలేదు; రాజైన చిరుతకు ఆ కబురందించింది.

అయితే శిక్ష అనుభవిస్తున్న సింహరాణి మాటలకంటే తమ మిత్రులే ఎక్కువయ్యారు చిరుతకు- అది సింహరాణి మాటల్ని

పట్టించుకోలేదు.

అయితే ఆరోజు రాత్రికే దానిపైన దాడి చేసినై, పెద్దపులి-నక్క! గాయాలతో నేలకూలిన చిరుతను అలాగే వదిలి అవి కొత్త కార్యవర్గాన్ని ఎంపిక చేసుకోవటంలో మునిగాయి. అయితే చిరుత పరిపాలనతో విసిగిపోయిన అధికారులెవ్వరూ వీళ్ళని నమ్మలేదు- కొందరు తామే రాజులం అన్నారు; కొందరు సింహరాణిదే రాజ్యమన్నారు.

అంతా గందరగోళంగా ఉన్న ఆ సమయంలో మిత్రులు కొందరు సింహరాణిని కారాగారం-లోంచి విడిపించారు. రాజ భవనంలో గాయాలతో పడిఉన్న చిరుతను ఆమె స్వయంగా తన వీపుపైన వేసుకొని ఒంటె వైద్యుడి దగ్గరికి తీసుకుపోయింది.

ఆ తర్వాత కొన్నాళ్లకుగానీ చిరుత ఆరోగ్యం బాగు పడలేదు. ఆ సరికి అధికారం మొత్తం సింహరాణి వశమైంది. పెద్దపులి, నక్క అడవి నుండి బహిష్కరింపబడ్డాయి. ఆరోగ్యం బాగై వచ్చాక, చిరుతపులి తను చేసిన పనులన్నిటికీ చాలా పశ్చాత్తాపపడింది. సింహరాణికి నమస్కరించి, తను అడవి మూలల్లో తపస్సు చేసుకునేందుకు అనుమతి కోరింది. సింహరాణి దాన్ని క్షమించి వదిలేసింది.

సింహరాణి పాలనలో అడవిలోని జంతువులన్నీ సుఖసంతోషాలతో వర్థిల్లాయి!

**కనుక్కోండి చూద్దాం!**

4. తలపైన పూసే పువ్వు, ఎండ నుండి వాన నుండి కాపాడే పువ్వు, గుండ్రని పువ్వు, వాడిపోని పువ్వు, అది ఏంటి?

5. ఒక చెట్టుకు 12కొమ్మలు, ఒక్కొక్క కొమ్మకు 30ఆకులు.ఏమిటది?

6. పసుపు దుప్పట్లో తెల్లటి ఆసామి, అతనెవరు?



# సూపర్‌డాల్

*హైదరాబాదు బుక్‌ఫెయిర్లో కొత్తపల్లి అంగడి పెడితే, అందులో కూర్చొని కథలు రాసిన పిల్లల్లో ఒకడు, వంశీకృష్ణ. ప్రపంచం అంతరించటం, దాన్ని దుష్టశక్తులు స్వాగతించటం, మంచిశక్తులు వాటితో పోరాడటం..ఇదొక భయంకర ఘోర నేర ప్రపంచం..! చదవండి! ఈ యుద్ధప్రపంచం ఎలా ఉంటుందో ఊహించుకోండి! వీలైతే ఇందులో చిక్కుకోకుండా బయటపడండి!!*

*రచన: యం. వంశీకృష్ణ, 5 వ తరగతి, ద వివేకానంద స్కూలు, షాపుర్‌నగర్, రంగారెడ్డి జిల్లా.*

**కాలం 1958...**

అంతరిక్షంలో ఒక వింత జరిగింది.

ఆ వింతలో నుండి రెండు శక్తులు బయటికి వచ్చాయి.. ఒక శక్తి మంచిని కోరేది, ఇంకొక శక్తి మంచిని అంతం చేయాలి అనుకునేది.

వాళ్ళలో మంచిని కోరేది సూపర్‌డాల్ . ఇంకోదాని పేరు విలన్‌డాల్ - చెడుని కోరేది.

***

అంతకు కొన్నేళ్ళ ముందు , భూమి మీద..

రమేష్ చాలా మంచివాడు. ఒక పెద్ద కుటుంబంలో పుట్టాడు. బాగా చదువుకున్నాడు. భూమి గురించి బాగా తెలుసుకున్నాడు. భూమిపైన ఉండే చెడును అంతం చేయాలని అతనికి కోరిక. చాలా కష్టపడి అతను ఒక పరీక్షా కేంద్రం ఏర్పాటు చేసుకున్నాడు. అందులోని అధునాతన ఉపకరణాల సహాయంతో భూమి చుట్టు ప్రక్కల జరిగే పరిణామాలన్నిటినీ అతను గమనిస్తూ ఉన్నాడు.

భూమి పైనే మరొకడు కూడా ఉన్నాడు- అతని పేరు నితిన్. భూమిని తన స్వాధీనంలోకి తెచ్చుకోవాలని అతనికి చాలా కోరిక. తన కోరికను నెరవేర్చుకోవటం కోసం అతను ఎన్నో ప్రయోగాలు చేశాడు. చాలా చెడ్డవాడు అతను. ఒకవేళ భూమి తన ఆధీనంలోకి రాకపోతే దాన్ని అంతం చేసేందుకు కూడా వెనకాడడు ! అతను కూడా తన పనులకోసం ఒక పరీక్షా కేంద్రాన్ని ఏర్పాటు చేసుకున్నాడు.

**అంతరిక్షంలో..**

సూపర్‌డాల్ , విలన్‌డాల్ ల మధ్య తీవ్రంగా పోరాటం జరిగింది. రెండు సంవత్సరాలపాటు ఎడతెరపి లేకుండా, సర్వ శక్తులూ వినియోగించి పోరాడుకున్నారు వాళ్ళు. ఇద్దరూ బాగా అలిసిపోయారు.. ఇద్దరి శక్తులూ క్షీణ దశకు చేరుకున్నాయి. అదే సమయంలో భూమ్యాకర్షణలో పెను మార్పులు సంభవించాయి. ఇద్దరూ జారి, గిరగిర తిరుక్కుంటూ భూమి మీద పడిపోయారు!

విలన్‌డాల్ నితిన్‌కి దొరికింది. సూపర్‌డాల్ రమేష్‌కి దొరికింది.

విలన్‌డాల్ ని చూడగానే గుర్తుపట్టాడు నితిన్. దాన్ని తీసుకువెళ్ళి బాగు చేద్దామనుకు-న్నాడు. దాన్ని బాగుచేసే లోపల దాని శక్తులు అన్నిటినీ తను సొంతం చేసుకోవాలని పథకం వేశాడు. అయితే ఆలోగానే అనుకోకుండా స్పృహ వచ్చింది విలన్‌డాల్‌కు.. వెంటనే దానికి తెలిసిపోయింది- నితిన్ తన శక్తుల్ని సొంతం చేసుకోవాలనుకుంటున్నాడు! "నన్నే అంతం చేద్దామనుకున్నావా" అని దుర్మార్గుడైన నితిన్‌ను చంపేసింది విలన్ డాల్. నితిన్

తయారు చేసుకున్న పరీక్షా కేంద్రం అంతా ఇప్పుడు విలన్‌డాల్ సొంతం అయ్యింది!!



సూపర్ డాల్‌ను రమేష్ తన పరీక్షా కేంద్రానికి తీసుకువెళ్ళి బాగు చేశాడు. అప్పుడు సూపర్ డాల్‌కి స్పృహ వచ్చింది. రమేష్ తన గురించి చెప్పుకొని, సూపర్‌డాల్‌ని అడిగాడు- "నువ్వెవరు? ఇక్కడికి ఎలా చేరుకున్నావు?" అని. "నేను మంచిని రక్షించడానికి పుట్టాను- అలాగే చెడుకి గుర్తుగా విలన్ డాల్ పుట్టింది. అంతరిక్షంలో మేము ఇద్దరమూ చాలా సంవత్సరాలపాటు పోరాడుకున్నాం. ఆ పోరాటం కారణంగా మేం ఇద్దరం చాలా బలాలను కోల్పోయాం. శక్తిహీనులం అయ్యాం. అంతలో భూమ్యాకర్షణలో పెనుమార్పులేవో సంభవించాయి. బలహీనులం అయిపోయిన మేము ఇద్దరం ఆ తాకిడికి తట్టుకోలేక, భూమి మీద పడిపోయాం. నేను నీ చేత చిక్కటం నా భాగ్యం. మరి విలన్‌డాల్ ఎవరికి చిక్కిందో తెలీదు.. బ్రతికే ఉందో, లేదో కూడా తెలీదు.." అని చెబుతున్నది సూపర్ డాల్..

అంతలో సూపర్‌డాల్ మైండ్‌కి ఒక సిగ్నల్ వచ్చింది. నగరం మధ్యలో విధ్వంసం మొదలైంది.. కొద్దిసేపట్లోనే ఆ విధ్వంసం మరిన్ని ప్రాంతాలకు విస్తరించనున్నది. సూపర్‌డాల్‌కు వెంటనే అర్థమైంది- దీని వెనక ఉన్నదెవరో. తక్షణం అది బయలుదేరి వెళ్ళింది నగరం మధ్యకు. అక్కడ విలన్‌డాల్ సైనికులు కొందరు నిలబడి విధ్వంసం చేస్తున్నారు. ఎదురొచ్చినవాళ్లందరినీ తరిమి కొడుతున్నారు. సూపర్‌డాల్ మరుక్షణం తన శక్తుల్ని ప్రయోగించింది. దుర్మార్గులందరినీ మట్టుపెట్టింది.

అయితే దాంతో సూపర్ డాల్ విషయాలన్నీ విలన్ డాల్‌కు తెలిసిపోయాయి. సూపర్ డాల్‌కి తను కోల్పోయిన శక్తులన్నీ తిరిగి వచ్చాయి కానీ, విలన్ డాల్‌కి ఇంకా అన్ని శక్తులూ రాలేదు. అందువల్ల, విలన్ డాల్ ఏం చేద్దామనుకున్నా సూపర్‌డాల్ వాటినన్నిటినీ అలవోకగా నిరోధించగలిగింది. మన సూపర్‌డాల్ అలా ఎన్నోసార్లు విలన్‌డాల్ సైనికులనుండి భూమిని రక్షించింది.

ఇక చేసేదేమీలేక, విలన్‌డాల్ నేరుగా రంగం లోకి దిగింది. సూపర్ డాల్ కూడా దానికి ఎదురు నిలచి పోరాడింది. ఇద్దరూ మళ్ళీ ఒక ఐదు సంవత్సరాల పాటు పోరాడుకున్నారు. చివరికి మన సూపర్‌డాల్ విజయం సాధించింది. విలన్‌డాల్‌ను మట్టుపెట్టింది.

ఆనాటినుండి సూపర్‌డాల్ అలాగే భూమిని సమస్యల నుండి కాపాడుతూ ఉన్నది. అప్పటినుండి భూమికి ఇక ఏలాంటి సమస్యలూ రాలేదు; ప్రజలందరూ భూమిమీద సుఖంగా బ్రతకటం మొదలు పెట్టారు.



**కనుక్కోండి చూద్దాం!**

7. ఇళ్ళు లేని నగరాలు, నీళ్ళులేని సముద్రాలు. ఏమిటది?

8. పచ్చని పాము- తోకతో రాయిని మోస్తుంది. ఏమిటది?

9. కడుపు నిండగానే లేచి నిలబడతాడు. అతడు ఏవరు?

10. నిప్పుల్లో పుడుతుంది. ఆకాశంలోకి వెళ్తుంది. ఏమిటది?

(సమాధానాలు 58వ పేజీలో)




# రాజుగారి కుక్క

*రాజుగారికి, కుక్కలకు ఏదో సంబంధం ఉన్నట్లుంది.. లేకపోతే సుధ ఈ కథ ఎందుకు రాస్తుంది..?*

*రచన: బి.సుధ, 8 వతరగతి, అభ్యాసవిద్యాలయం, విజయవాడ.*

సీతారామపురం రాజ్యానికి రాజుగారు సీతారామరాజు. చాలా మంచి రాజన్నమాట ఆయన! అన్ని రాజ్యాల కన్నా వీళ్ళ రాజ్యమే గొప్పగా ఉండాలని ఆయన చాలా శ్రమించేవాడు.

వాళ్ళకి ఒక కుక్క ఉండేది. అది చాలా విశ్వాసపు కుక్క. రాజుగారి ఇంట్లో వాళ్ళంటే దానికి ప్రాణం . చాలాసార్లు వాళ్ళని దొంగల నుండి కాపాడింది అది. ఒకసారి రాజుగారి కుటుంబం మొత్తం బంధువుల ఇంటికి, వేరే రాజ్యానికి వెళ్ళింది. రాజుగారి సేవకులు కుక్కకి సరిగా తిండిపెట్టే వాళ్ళు కారు. అయినా ఆ కుక్క రాజుగారి ఇంటిని విడిచిపెట్టి పోలేదు. అన్నం పెడితే తినేది; లేకపోతే పస్తుండేది. అలా చాలా రోజులు గడిచాయి.

అదే సమయంలో గంగమ్మ జాతర వచ్చింది.

రాజుగారి సేవకులతో సహా ప్రజలంతా ఆ జాతరలోనే ఉన్నారు. పాపం కుక్కకి వారం రోజుల నుండి అన్నం లేక, బక్క చిక్కిపోయింది. 'కనీసం ఈ రోజన్నా అన్నం దొరుకుతుందేమో' అనుకొని రాజ్యంలో ఉన్న ప్రతి ఇంటికీ వెళ్ళింది అది. కానీ అందరూ జాతరలో ఉన్నారు కదా, ఇళ్ళలో ఎవ్వరూ దొరకలేదు దానికి.

'గుడి దగ్గరకి వెళ్తే ఏమన్నా దొరుకుతుందేమో' అని అక్కడికి వెళ్ళిందది. గుడి దగ్గర చాలా ఇరుకుగా ఉంది. జనాలందరూ ఎక్కువ అవ్వటంతో తొక్కిసలాట జరిగింది. ఆ తొక్కిసలాటలో ఎవరోదాన్ని క్రిందికి తోసేసారు. పాపం జనాల కాళ్ల క్రింద పడి ఆ కుక్క అక్కడే చనిపోయింది!

తర్వాత కొన్ని రోజులకు రాజుగారి కుటుంబం వెనక్కి తిరిగి వచ్చింది. అయినా వాళ్ళకి కుక్క అసలు గుర్తుకే రాలేదు! 'మా కుక్క ఏది?' అని కూడా ఆలోచించలేదు రాజుగారు గానీ, ఇంట్లోవాళ్ళు గానీ!

ఆ తర్వాత ఒక రోజున రాజుగారు కుటుంబంతో సహా అడవిలో విహారానికి బయలుదేరారు. కొంతమంది భటులు మాత్రం వాళ్ళను అనుసరించి పోతున్నారు. అకస్మాత్తుగా శత్రు సైనికులు ఎదురయ్యారు వాళ్ళకి! రాజుగారు, భటులు వాళ్ళతో యుద్ధం చేస్తుంటే రాణి, యువరాజు ఇద్దరూ వణుక్కుంటూ చెట్టు పొదల్లో నక్కి కూర్చున్నారు. అప్పుడుగానీ వాళ్ళకు కుక్క గుర్తుకు రాలేదు. అది ఉండి ఉంటే శత్రు సైనికుల రాకను ముందుగానే పసిగట్టేది! వాళ్ళతో తెగించి పోరాడేది కూడాను!

ఆ పోరాటంలో రాజుకు చాలా గాయాలే అయ్యాయి. ఆయన్ని వెనక్కి తీసుకువచ్చి సేవలు చేస్తూ ఇంట్లో వాళ్లంతా కుక్కను బాగా గుర్తు చేసుకున్నారు. రాజుగారు కూడా కుక్కను తలచుకొని పశ్చాత్తాప పడ్డాడు.

ఆ తర్వాత మళ్ళీ వాళ్ళు వేరే కుక్కను తెచ్చుకొని చాలా ప్రేమగా పెంచారు. కానీ అది ఏనాడూ మొదటి కుక్క అంత చలాకీగా లేనే లేదు!



# పందుల కథ

*పందులు బురదలో ఎందుకు దొర్లుతాయి? మాకూ తెలీలేదు- ఇదిగో, పుట్టినరోజు బాబు మైత్రేష్ చెప్పిన ఈ ఇంగ్లీషు జానపదకథ చదివేంతవరకూ. మీకు తెలుసేమో మరి- అయినా చదవండి..*



*సేకరణ, కథనం: మైత్రేష్, ఏడవ తరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరుజిల్లా.*

చాలా వందల ఏళ్ళ క్రితం పందులు శుభ్రంగానే ఉండేవి. వాటి మాంసం క్రూరమృగాలకు చాలా ఇష్టంగా ఉండేది. కానీ ఇప్పుడు పందులంటే అందరికీ అసహ్యమే. ఎందుకో తెలుసుకోవాలంటే చదవండి, ఈ కథ.

ఒక పెద్ద అడవిలో సాగర్ అనే ఒక చిన్న పంది తన కుటుంబంతో నివసిస్తూ ఉండేది. వేసవి కాలంలో ఒక రోజు సాగర్ బయటకు వెళుతుంటే "జాగ్రత్తగా ఉండు. ఎక్కువ దూరం వెళ్ళకు " అని చెప్పింది వాళ్ల అమ్మ. "ఎక్కువ దూరం వెళ్ళావంటే అడవి జంతువులకు తిండివి అవుతావు" అన్నాడు

నాన్న.

"సరే! దూరం వెళ్ళనులే" అంటూ బయలుదేరాడు సాగర్.

ఆడుతూ పాడుతూ తెలీకుండానే అడవిలో చాలా దూరం వెళ్ళాడు. కొద్ది సేపటికి మిట్ట మధ్యాహ్నం అయింది.

"చాలా వేడిగా ఉంది. ఏమి చెయ్యను?" అనుకున్నాడు సాగర్.

అంతలో వాడికి ఒక బురద గుంట కనిపించింది. "అక్కడికి వెళ్ళి దొర్లితే చల్లగా ఉంటుంది" అనుకొని, సాగర్ ఆ బురదలో దొర్లుతూ ఉండిపోయాడు చాలాసేపు.

ఆ తర్వాత తేరుకొని ఒళ్ళంతా చూసుకున్నాడు. నల్లగా, బురద బురదగా అయ్యింది. "ఇది ఎంతో హాయిగా ఉంది కానీ ఇలా ఇంటికి వెళితే అమ్మ తిడుతుంది. ఇంటికి స్నానం చేసే వెళ్ళాలి" అని నిర్ణయించుకుని అక్కడ నుండి లేచాడు.

"కానీ ఇక్కడ ఎక్కడా స్నానం చేయడానికి చెరువు లేదే- సరే. ఇంకా కొద్ది దూరం వెళతాను- ఏదైనా చెరువు కనిపించవచ్చు" అనుకొని ముందుకు సాగాడు.

అనుకున్నట్లే పెద్ద చెరువు ఒకటి కనిపించింది వాడికి. వెంటనే అక్కడికి పరిగెత్తి దానిలో స్నానం చేయడం మొదలుపెట్టాడు.

కాసేపటికి ఆ చెరువులో నీళ్ళు త్రాగడానికి వచ్చింది ఒక తోడేలు. "చెరువులో ఉన్న నీరంతా మురికిగా అయిపోయిందేమిటి?" అనుకుంటూ ఆవలి వైపుకి చూసింది. అక్కడ సాగర్ కనిపించాడు. వాడిని చూడగానే దానికి అర్థమైంది- సాగరే నీరంతా మురికి చేశాడని. తోడేలుకు విపరీతమైన కోపం వచ్చింది. "నేను 'మంచి నీళ్ళు త్రాగుదాం' అనుకొని వస్తే నువ్వు నా నీళ్లన్నిటినీ మురికి చేస్తావా? ఇప్పుడే భోజనం చేసి వచ్చాను కాబట్టి సరిపోయింది. నిన్ను రేపు పీక్కు తింటాను. ఒకవేళ నువ్వు రేపు ఇక్కడికి రాలేదనుకో, నేనే మీ ఇంటికి వస్తాను! మీ కుటుంబంలో అందరినీ నమిలి తినేస్తాను!!" అని బెదిరించి వెళ్ళిపోయింది తోడేలు.

సాగర్‌కు చాలా భయం వేసింది. ఏం

చెయ్యాలో తెలీలేదు. వణుక్కుంటూనే ఇంటికి పరుగెత్తాడు. ఇంట్లో అందరికీ చెప్పాడు జరిగిన సంగతి.

"జాగ్రత్తగా ఉండమని చెప్పాను కదా! ఎందుకు వెళ్ళావు అక్కడికి?" తిట్టింది అమ్మ.

"ఎక్కువ దూరం వెళ్ళావుగా, ఇప్పుడు ఏమైందో చూడు!" అన్నాడు నాన్న.

"సరేలే, జరిగిందేదో జరిగి పోయింది. ఇప్పుడు మనకి ఒక ఉపాయం కావాలి- ఏం చేద్దాం?" అన్నాడు తాతయ్య.

అందరూ ఉపాయం కోసం ఆలోచించడం మొదలుపెట్టారు. అయినా తాతయ్యకు ఏమీ ఉపాయం తోచలేదు. "అసలు నువ్వు ఎందుకురా, అమ్మ మాట వినకుండా దూరంగా వెళ్ళావు?" అడిగాడు ఊరికే.

"ముందు నేను బురదలో దొర్లాను; కంపు కొట్టటం మొదలెట్టాను కదా, అందుకని స్నానం చేయాల్సి వచ్చింది! వెతుక్కుంటూ చెరువు దగ్గరికి వెళ్ళాను. చెరువు చాలా దూరంగా ఉంది- నేనేం చెయ్యను?" అన్నాడు.

"అయ్యో! మరి నువ్వు అసలు బురదలో ఎందుకు దొర్లావురా?" అని అడిగాడు తాతయ్య.

"వాతావరణం వేడిగా ఉంది కదా తాతయ్యా! బురదలో దొర్లితే హాయిగా, చల్లగా అనిపించింది!"జవాబిచ్చాడు సాగర్.

అది వినగానే తాతకు తటాలున ఒక ఉపాయం తట్టింది. "ఒరే! నువ్వు పొద్దున్నే మళ్ళీ అదే చెరువు దగ్గరకు వెళ్ళు. అయితే అలా వెళ్ళే ముందు బాగా కంపు కొట్టే మురుగులో మరింత ఎక్కువ సేపు దొర్లి, ఆ తర్వాత వెళ్ళు! స్నానం మాత్రం చెయ్యకు!!" అన్నాడు గుసగుసగా.

సాగర్ కు తాతయ్య ఉపాయం అర్థం అయి, చాలా సంతోషం వేసింది.

మరునాడు పొద్దున లేచీ లేవగానే వెతికి వెతికి బాగా కంపు కొట్టే మురుగులో పది నిమిషాలు దొర్లాడు సాగర్.

ఆ తర్వాత ఎక్కడా ఆగకుండా చెరువు దగ్గరకు

వెళ్ళి, తోడేలు రాక కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

తనకంపు తనే భరించలేకున్నాడు వాడు- అయితేనేమి, ఎంత కంపు కొట్టినా కదలకుండా కూర్చున్నాడు.

కొంతసేపటికి తోడేలు వచ్చింది. సాగర్ అక్కడ నిలబడి ఉండటం చూసి సంతోషపడింది. వెంటనే దాన్ని తిందామని రెండు అడుగులు ముందుకు వేసిందల్లా ఆగి- "ఛీ! ఛీ! కంపు!!" అని అరిచింది. "నేను తట్టుకోలేను బాబూ!"అంటూ సాగర్‌ని వదిలి వెనక్కి పరుగు తీసింది.

సాగర్ ఊరికే వదులుతాడా, దాన్ని!? "రా, నన్ను తిను! నీకోసమే వచ్చాను! నన్ను తినకుండా వెళతావేం..!" అంటూ దాని వెంట పరిగెత్తాడు.

"బాబోయ్! కంపు! కంపు!.. ఛీ! ఛీ! భరించలేకపోతున్నా! వెళ్ళు! వెళ్ళు!" అంటూ వెనక్కి తిరిగి చూడకుండా పరిగెత్తింది తోడేలు.

అది కనుమరుగు కాగానే సాగర్ విరగబడి నవ్వాడు. కడుపుబ్బ నవ్వుతూ ఇంటిదారి పట్టాడు.

క్షేమంగా ఇంటికి చేరిన సాగర్‌ని చూసి తాత, తల్లి, తండ్రి చాలా సంతోషించారు.

తాత అయితే తన మనవడు తోడేలు బారి నుంచి తప్పించుకుని వచ్చిన వైనాన్ని మిగిలిన పందులన్నిటికీ కథలు కథలుగా చెప్పాడు.

ఆనాటినుండీ తోడేలును దూరం పెట్టటంకోసం ఆ పందులన్నీ కూడా బురదలో దొర్లసాగాయి- రాను రాను అవి మురుగు వాసనను యిష్టపడటం కూడా మొదలుపెట్టాయి!

ఇప్పుడు తెలిసిందా, పందులు బురదలో ఎందుకు దొర్లుతాయో?!

**సుభాషితం**

మన బుద్ధి మనం చేసే పనినే అనుసరిస్తూ ఉంటుంది.



# పట్టుబడిన దొంగ



రచన: బి. రాజు, 8 వతరగతి, z.p.h.స్కూల్, చెన్నేకొత్తపల్లి.

రామనగరంలో ఉండే చలపతికి ఆఫీసులో ఏదో ముఖ్యమైన పని పడింది. ఇంట్లోంచి బయలుదేరే ముందు హడావిడిగా ఇంటి తాళం కోసం వెతికాడు చలపతి. తాళమూ కనపడలేదు; తాళపు చెవీ లేదు! ఇంట్లో చాలా డబ్బులు, బంగారు నగలు ఉన్నై.

చలపతి ఇంటి ముందే ఉంటాడు గణపతి. గణపతి ఏమంత మంచివాడు కాదు- వాడికి లేని అలవాటు లేదు. అయినా అవసరం గణపతిది. ఆఫీసుకు వెళ్ళకుండా ఉండనూ లేదు; తాళం వెయ్యకుండా ఇంటిని వదిలి వెళ్ళనూ లేదు- 'కానీలే' అనుకున్నాడు. గణపతిని పిలిచాడు. 'ఇంట్లో విలువైన సామాను ఉన్నది; ఇల్లు కాసేపు చూసుకో'మని చెప్పి, గబగబా ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

చలపతి ఆఫీసు పని ముగించుకొని ఇంటికి వచ్చేసరికి సాయంత్రం అయ్యింది. చూడగా ఇంట్లో లైట్లు వెలగటం లేదు. ఇంటి తలుపులు బార్లా తీసి ఉన్నాయి!

చలపతి హడావిడిగా లైట్లు వేసి చూశాడు. లోపలికి పోయి చూస్తే గణపతి ఒక స్తంభానికి కట్టివేసి వున్నాడు! లోపల బీరువాలో సామాన్లన్నీ చెల్లా చెదరుగా పడేసి ఉన్నాయి. డబ్బులు, నగలు అన్నీ మాయం!

చలపతి గబగబా గణపతి కట్లు విప్పి వణుకుతున్న గొంతుతో అడిగాడు "ఏమైంది, ఎవరు, నిన్ను ఇట్లా కట్టేసింది?" అని.

గణపతి భోరుమని ఏడ్చాడు. ఏడుస్తూనే చెప్పాడు- "నువ్వు ఇలా వెళ్ళావుగదా, ఆఫీసుకు? నేను మా ఇంటి తలుపులు వేసి మీ ఇంట్లోకి వచ్చానో లేదో- ఓ దొంగ లోపలికి దూరి తలుపులు వేసేశాడు. నేను నోరు తెరిచేంతలో నా మీదికి దూకాడు. నన్ను కట్టివేసాడు- తీరుబడిగా బీరువా తెరచుకొని, నగలు, డబ్బులు, విలువైన వస్తువులు- అన్నీ దోచుకొని పోయాడు! నేను ఉండీ ఏమీ చెయ్యలేనివాడినయ్యాను!" అన్నాడు.

చలపతికి అనుమానం వచ్చింది- "ఇన్నేళ్ళుగా తమ కాలనీలో దొంగతనం అన్న మాటే లేదు. అకస్మాత్తుగా, అదీ తనకు ఆఫీసు పని పడగానే ఇలా ఎందుకు జరుగుతుంది? ఏదో మోసం ఉంది!"- వెంటనే గణపతిని, అక్కడికి చేరిన ఇరుగు పొరుగు వాళ్ళను అక్కడే ఉండమన్నాడు; తన స్నేహితుడు లాయర్ జగన్నాథ్ దగ్గరికి వెళ్ళి టూకీగా జరిగినదంతా చెప్పాడు- "గణపతినీ నమ్మేట్లు లేదు" అని జోడించాడు.

జగన్నాథ్ చాలా తెలివైనవాడు. లాయర్‌గా అతనికి చాలా మందితో పరిచయం ఉన్నది; అతను స్వయంగా చాలా నేరాలను పరిశోధించి ఉన్నాడు కూడాను. చలపతిని అతను కొన్ని ప్రశ్నలు అడిగాడు- "గణపతిని తాడుతో కట్టేశాడు కదా, దొంగ? ముడి ఎటువైపు వేశాడు?" అని కూడా అడిగాడు. చలపతి గుర్తు చేసుకొని చెప్పాడు- గణపతి కాళ్ళు, నడుము, చేతులు- కట్టేసి ఉన్నై..ముడులు ముందువైపుకే ఉన్నట్లున్నై" అన్నాడు.

దానితో జగన్నాథ్ అనుమానం మరింత బలపడింది. అతను ఎవరెవరికో ఫోన్లు చేసి, అటుపైన ఒక మనిషిని పంపి గణపతిని వెంటబెట్టుకు రమ్మన్నాడు. చలపతి ఇంటికి తిరిగి వచ్చేంతవరకు ఇరుగు పొరుగు వాళ్ళను కొందరిని ఇల్లు గమనించుకుంటూ అక్కడే ఉండమన్నాడు.

అంతలో ఎవరో నలుగురు మనుషులు వచ్చారు. జగన్నాథ్ వాళ్లతో మాట్లాడి, నలుగురినీ పెడరెక్కలు విరిచికట్టి, వాళ్లను తమ ఇంటి ముందుగదిలో వరసగా నిలబెట్టాడు. తను పంపిన మనిషి గణపతిని వెంటబెట్టుకొని వచ్చేసరికి, జగన్నాథ్ అతన్ని ఏం జరిగిందో అడిగి, "చూడు బాబూ! జాగ్రత్తగా చూడు- వీళ్లందరూ ఈ రోజు పగలు దొంగతనం చేసిన వాళ్ళు. వీళ్లలో ఎవరు, నిన్ను కట్టేసి చలపతి ఇంటిని దోచుకుపోయింది?" అని అడిగాడు.

గణపతి కొంచెం సేపు అందరినీ తేరిపార చూసాడు- అటుపైన అక్కడ నిలబెట్టినవాళ్లలో ఒకడిని చూపించి- "సందేహంలేదు- వీడే, ఈ గడ్డం వాడే, నన్ను కట్టేసింది!" అన్నాడు. మరుక్షణం జగన్నాథ్ గణపతి చేతికి సంకెళ్ళు వేసేసాడు!

"నాకు ఎందుకు సంకెళ్ళువేస్తావు, దొంగని నీ ఎదురుగా పెట్టుకొని?!" అన్నాడు గణపతి, గింజుకుంటూ.

"ఓరి పిచ్చి నాయనా! ఈ నలుగురూ నీకోసం వచ్చిన పోలీసులురా! ఇంక నువ్వు ఒప్పుకోవచ్చు- నువ్వే దొంగతనం చేసావని మాకు తెలిసిపోయింది. మర్యాదగా డబ్బులు, నగలు ఎక్కడదాచావో చెప్పకపోతే వీళ్ళు నిన్ను ఏం చేస్తారో నాకూ తెలీదు మరి!" అన్నాడు జగన్నాథ్ సన్నగా నవ్వుతూ.

గణపతి ఆట కట్టు అయ్యింది. డబ్బు దస్కాలను తనే వేరే చోటికి తరలించి, అటుపైన తనని తాను కట్టేసుకొని, వేరే ఎవరిమీదో ఆ దొంగతనాన్ని నెట్టేద్దామనుకున్న గణపతి పథకం ఫలించలేదు. అతను ఇంక చేసేదేమీ లేక తన తప్పును తాను ఒప్పుకున్నాడు. చలపతి ఇంట్లో దోచిన డబ్బు, నగలు పూర్తిగా వెనక్కి ఇచ్చేసాడు.

"వీడు చాలా మందిని మోసం చేసాడని విన్నాను గానీ, నన్నూ ఇంతగా మోసం చేస్తాడనుకోలేదు చూడు! -తనదాకా వస్తేగానీ తెలీదంటారు అందుకే!" ఇల్లు సర్దుకుంటూ అనుకున్నాడు చలపతి, బాధగా.

నవ్వం!

**ట్యూబులైటు!**

టీచర్: ఎగ్జామ్ హాల్లో కనిపించే మూడు పేపర్లు ఏవేవో చెప్పండి?

విద్యార్థి: క్వశ్చన్ పేపర్, ఆన్సర్ షీట్, అడిషనల్ పేపర్...ఇంకా..ఇంకా..

టీచర్: ఇంకానా?! మూడే కదా, నేను చెప్పింది?!

విద్యార్థి: కనిపించని నాలుగో పేపర్ ఉంటుంది టీచర్- ...అదే- నేను కాపీ కొట్టేందుకు రాసుకెళ్ళే చీటీ!

**కుక్క-పిల్లి**

రాము: గోపి! మీ ఇంట్లో పిల్లి, కుక్క స్నేహంగా ఉంటాయా?

గోపీ: ఇంట్లో మా చెల్లి-నేనే స్నేహంగా ఉండం. ఇంక అవేం ఉంటాయి?

**తెల్ల కాగితం!**

వెంగళప్ప: 5 తెల్ల పేపర్లు ఇవ్వండి.

షాపు యజమాని: 5 పేపర్లు లేవు, ఒక్కటే ఉంది.

వెంగళప్ప: పర్వాలేదు- ఆ ఒక్కటే ఇవ్వండి, దాన్నే జిరాక్స్ తీయించుకుంటాను.

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: శ్రీమతి జి. లలిత*, telugu4kids.com

*చిత్రం: జె.శ్రీకాంత్*, 7B, *ప్రతిభ హైస్కూల్, నాచారం, హైదరాబాదు.*

క్రింది బొమ్మను చూడండి: మీకు ఏమనిపిస్తున్నది?




డిసెంబరు నెల కావచ్చు..క్రిస్మస్ చెట్టు ఉంది కదా; వీడి పుట్టిన రోజేమో.. కేకు, క్యాండిలు ఉన్నై. మరి వీడు ఒక్కడే ఉన్నాడేంటి? ఆకాశంలో సూర్యుడేంటి, మబ్బులమాటున? వీటినన్నిటినీ చూసి ఏదైనా కథ రాయరాదూ? మీరు రాసి పంపిన కథ బాగుంటే రెండు నెలల తర్వాత ఆ కథని కొత్తపల్లిలో ప్రచురిస్తాం!

మా చిరునామా: కొత్తపల్లి బృందం, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా 515101



# మాట్లాడే ఒంటె

*రెండు నెలల క్రితం కొత్తపల్లి లో ఇచ్చిన ఒంటె బొమ్మకు కథ రాసి పంపాడు ప్రకాశ్. మాకు ఈ కథ చాలా నచ్చింది. మరి మీకెలా అనిపించింది?*

*రచన: కె.ప్రకాశ్, 3 వతరగతి, మహేంద్రా అకాడమి, జహీరాబాద్, మెదక్ జిల్లా.*



అనగనగా ఒక ఎడారిలో ఒక ఒంటె ఉండేది. దానిపేరు మిట్టూ. దాని యజమాని దానికి మాట్లాడటం నేర్పించాడు.

ఒకరోజు దాని యజమాని ఇంట్లో లేడు.

అప్పుడు ఆయన స్నేహితుడు వచ్చాడు. ఇంట్లో ఉన్న బంగారం అంతా దోచుకెళ్లాడు.

అదంతా గమనించింది మిట్టూ.

కొన్ని రోజుల తర్వాత తిరిగి వచ్చాడు యజమాని. చూస్తే ఇంట్లో బంగారం లేదు!

ఇంట్లో బంగారం అంతా పోయిందని చాలా విచారించాడు ఆయన.

దిగులుతో ఉన్న యజమానిని చూసి మిట్టూ

చాలా బాధ పడింది. ఎలాగైనా దొంగని పట్టివ్వాలని అనుకున్నది.

యజమానితో అన్నది- "మీరు తిరిగి వచ్చిన సందర్భంగా మీ స్నేహితులందరికీ ఒక విందు ఏర్పాటు చేయండి. ప్రతి ఒక్కరినీ ఆ విందుకు ఆహ్వానించండి. ఆపైన ఏం జరుగుతుందో చూడండి" అని.

ఆయన సరేనని, ఒక విందు ఏర్పాటు చేశాడు. దానికి తన స్నేహితులు అందరినీ ఆహ్వానించాడు.

ఒంటె విషయం తెలీదు కదా, దొంగ స్నేహితుడికి? అందుకని ఆ దొంగ స్నేహితుడు కూడా వచ్చాడు విందుకు.

అక్కడే నిలబడి అందర్నీ గమనిస్తూ ఉన్నది మిట్టూ. విందుకు వచ్చిన దొంగని చూడగానే గుర్తుపట్టిందది. యజమాని దగ్గరికి పోయి ఆ దొంగ ఆనవాళ్ళు చెప్పింది, ఆయన చెవిలో.



అయినా అది చుట్టూ ఉన్న వాళ్ళు అందరికీ వినబడింది. ఒంటె మాట్లడటం చూసి ముందు ఆశ్చర్యపోయారు అందరూ.

అటుపైన అందరూ కలిసి దొంగను పట్టుకున్నారు. అతను దొంగిలించిన బంగారాన్నంతా తిరిగి రాబట్టారు.

పోయిందనుకున్న బంగారం దొరికినందుకు యజమాని చాలా సంతోషించాడు.

మిట్టూని ప్రేమగా నిమిరాడు.

మిట్టూ ఎంతో ఆనందించింది.

**ఏంకాలం?!**

సంధ్య: కాలాలు ఎన్ని, అవి ఏవి?

సీత: కాలాలు నాలుగు. ఎండాకాలం, వానాకాలం, శీతాకాలం,..ఇంకా.. *పోయేకాలం!*




ఇందు బిందు మంచి స్నేహితురాళ్ళు. చదివేది మూడో తరగతే గానీ, తెలివి తేటలు మాత్రం పెద్దవాళ్ళంత ఉన్నై. కష్టాల్లో ఉన్నవాళ్ళకి సాయం చేయటంలో వాళ్ళెప్పుడూ ముందు నిలుస్తారు. ఒకరోజు ఏమైందంటే---...























# చిన్ని చిన్ని కరుణ !



*రచన: తవ్వా లక్ష్మీప్రసూన, జూనియర్ ఇంటర్, మైదుకూరు, కడప జిల్లా.*

వేకువజామువేళ.

పక్షులు కిలకిలమంటూ ప్రపంచాన్ని నిద్ర లేపుతున్నాయి. పూజ చదువుకుంటున్నది. అప్పుడే రెండు పిచ్చుకలు పూజవాళ్ల ఇంటి వసారాలోకి వచ్చాయి. పూజ దృష్టి ఆ పిచ్చుకల వైపుకు మళ్ళింది. అదే సమయానికి ఇంట్లోంచి వసారాలోకి వచ్చాడు, పూజ వాళ్ళ నాన్న. పూజ పిచ్చుకలను చూడటం గమనించి, తన చిన్ననాటి విషయాలను గుర్తుచేసుకున్నాడు-

"ఊళ్లో అలాంటి పిచ్చుకలు చాలా ఉండేవి. ఊళ్ళోవాళ్ళు ఈ ఊర పిచ్చుకల కోసమే జొన్నకంకులూ, సొద్ద(సజ్జ)కంకులూ తమ మొగసాలల్లో వేలాడదీసేవాళ్ళు. ఏటి గట్టున చెట్లమీద ఇంకా ఎన్నోరకాల పక్షులు ఉండేవి- వాటిని చూడటానికి ఊరి పిల్లలం అందరం ఏటిగట్టుకు వెళ్ళేవాళ్ళం. " చెప్పాడు ఆయన.

"ఊళ్ళో పిల్లలు ఇప్పుడు కూడా ఏటి గట్టుకు వెళ్తుంటారు కదూ, నాన్నా?"అడిగింది పూజ.

"ఇప్పటి పిల్లలా ?! ఎవరూ వెళ్ళటం లేదు!" అన్నాడు నాన్న.



“అదేమి?! ఎందుకు వెళ్ళట్లేదు ఎవ్వరూ!?” ఆశ్చర్యంగా అడిగింది పూజ.

"చాలా కారణాలు ఉన్నై పాపా. ఒకటి, ఈ మధ్య పిల్లలకు తమదంటూ ఒక్క గంట సమయాన్నికూడా వదలటం లేదు పెద్దవాళ్ళు. ఎప్పుడూ ఏవేవో క్లాసులనీ, స్టడీ అవర్లనీ వాళ్లని బిజీగా ఉంచేస్తున్నారు. ఇంక వాళ్ళు ప్రశాంతంగా ప్రకృతిని ఆస్వాదించేదెన్నడు?

ఇక రెండోది, ఇప్పుడు అలాంటి పక్షులు చాలా వరకూ అంతరించి పోయాయి. మిగిలినవి అక్కడక్కడా తమకు నచ్చిన చోట్లు వెతుక్కొని దాక్కొని కూర్చుంటున్నాయి. అవి కూడా చాలా తక్కువే అని చెప్పాలి"

"అయ్యో, అలా ఎందుకు జరిగింది నాన్నా?" అడిగింది కరుణ.

"నానాటికీ లోపిస్తున్న పర్యావరణ సమతౌల్యం దీనికి ప్రధాన కారణం. మనుషులు తమ స్వార్థం కోసం ప్రకృతి విధ్వంసానికి పాల్పడుతున్నారు. ప్రకృతిలోని ఎన్నో అరుదైన జంతువులు, పక్షులు, వృక్షాలు అంతరించిపోతున్నాయి. అలా అంతరించి-పోతున్న పక్షుల్లో- ఇవిగో, ఈ పిచ్చుకలు మొదటి వరుసలో ఉన్నాయి. సెల్‌ఫోన్ టవర్ల నుండి వచ్చే రేడియేషన్ కారణంగా ఊర పిచ్చుకలు అధిక సంఖ్యలో చనిపో-తున్నాయట. ఇంక ఏమనాలి? అంతేకాదు, పూర్వం పూరిళ్ళ చూర్లలోను, ఇంటి పై కప్పు దంతెల మాటున, గోడలకు ఏర్పాటు చేసిన గూళ్ళలోను ఇవి నివాసం ఏర్పరచుకుని జీవిస్తూ ఉండేవి. ఇప్పుడు స్లాబు ఇళ్ళు వచ్చాయి కదా, పిచ్చుకలకు ఇవి అనువుగా

ఉండవు; ఏతావాతా వాటి మనుగడకే ముప్పు ఏర్పడింది!” పూజ వాళ్ళనాన్న చెప్పాడు.



ఇది విని పూజ చిన్ని మనసుకు చాలా కష్టం కలిగింది. ఆరోజునే చెక్కలతో ఒక గూడును తయారు చేసి, వాళ్ల ఇంటి వసారా కప్పుకు కట్టింది పూజ . పిచ్చుకలు రోజూ ఆ గూటి చుట్టూ ఎగిరేవి; కానీ ఆ గూట్లోకి మాత్రం వెళ్ళలేదు! అదేమైనా వల అనుకున్నాయేమో, అవి. అయితే అటు తర్వాత మెల్ల మెల్లగా అవి గూట్లోకి వెళ్ళటం, రాత్రంతా అక్కడే ఉండిపోయి ఉదయాన్నే రివ్వున ఎగిరిపోవటం మొదలు పెట్టాయి. అది చూసి పూజ ఎంతగానో సంతోషపడింది.

'ఈ రేడియేషన్లు-అవీ లేకుండా ఉంటే ఎంత బాగుంటుందో! మన ఇళ్ళు కొంచెం పిచ్చుకలకు కూడా అనువుగా ఉంటే ఎంత బాగుంటుందో కదా!" అనుకున్నది పూజ.

జోకు

**త్రాసు ఉచితం!**

కస్టమర్ (కోపంగా అడిగాడు): పావుకిలో హల్వా పార్శిల్ చేయమంటే, ఐదువందల రూపాయలకు బిల్లు వేశావేమిటి?

షాప్ యజమాని: "త్రాసుకు అతుక్కుని, హల్వా ఊడి రాలేదు సార్. అందుకని మీకు త్రాసును కూడా 'ఫ్రీ' గా ఇవ్వాలని నిర్ణయించాం!

# పని చేస్తుందాం

*రచన, చిత్రాలు: సి.రాము, కొత్తపల్లి బృందం.*

రోజా ఒకరోజున పుస్తకం చదువుతోంది. అందులో చాలా సీతాకోక చిలుకల బొమ్మలున్నై.

చూస్తూ చూస్తూండగానే వాటిలో ఒక సీతాకోక చిలుక పుస్తకంలోంచి లేచి, పైకి ఎగిరింది.





వెంటనే మరొకటి! ఆ వెంటనే మరొకటి! ఇట్లా సీతాకోకచిలుకలన్నిటికీ ప్రాణం వచ్చేసింది! అన్నీ ఎగరటం మొదలెట్టేసాయి!

రోజా వాటిని చూసి మురిసిపోయింది. తనూ లేచి బయలుదేరింది. అవి ఎటు తీసుకెళ్తే అటు వెళ్ళింది.



సీతాకోక చిలుకలు తనని ఏ దారి గుండా తీసుకెళ్ళాయో మరి, అకస్మాత్తుగా రోజా చుట్టూ చీకటి- మళ్ళీ వెంటనే వెలుగు!



అక్కడ మరిన్ని సీతాకోకచిలుకలున్నై! పాడుతూ, దాగుడు మూతలు ఆడుతూ, ఎగురుతున్నై, పూవుల మధ్యలో! అన్నీ భలే సంతోషంగా ఉన్నై. వాటి సంతోషం రోజాకూ అంటింది. ఓ అద్భుత ప్రపంచంలోకి వచ్చేసిన అనుభూతి కల్గింది ఆ పాపకు.



అంతలో ఓ సీతాకోక చిలుక వచ్చి రోజా చేతి మీద వాలింది. రోజా వైపు వింతగా చూస్తూ "ఎవరు పాపా, నువ్వు?" అని అడిగింది.

"నేను రోజాను!" అంది పాప.

"అరే! భలే ఉందే! మా తోటలో ఒక రకం పువ్వుల పేరూ అదే!" నవ్వింది సీతాకోక చిలుక.

"మీరంటే నాకు చాలా ఇష్టం. మీరు ఎప్పుడూ సంతోషంగా ఎగురుతూ ఉంటారు కదా, అందుకని!" చెప్పింది రోజా.

"ఔనా! థాంక్స్!" నవ్వింది సీతాకోక చిలుక. "నేను ఇక్కడి టీచర్ని. అందుకని నిన్ను రెండు ప్రశ్నలు అడుగుతాను. సరేనా?" అంది.

"అయ్యో నాకు మాథ్స్ అయితే సరిగ్గా రాదు టీచర్! సోషల్ అయితే బాగా వచ్చు! తెలుగు కూడా!" అంది రోజా.

"సులభం ప్రశ్నలేలే. నీకు అందరిలోకీ ఎవ్వరంటే చాలా చాలా ఇష్టం?"

"ఉం.." అని కొంచెం ఆలోచించింది రోజా. "నాకు రోజా అంటే చాలా చాలా ఇష్టం" అంది.

సీతాకోక చిలుక రెక్కలు టపటపలాడించింది. "భలే! మాకు కూడా మేమంటే చాలా చాలా ఇష్టం" చెప్పింది.



"నువ్వు ఎప్పుడూ ఏం చేస్తుంటావు?" అడిగింది అది ఇప్పుడు.

"ఉం... ఏదో ఒక పని!" అన్నది రోజా.

"వావ్! మేం కూడా! మేం చేసేది ఏదైనా పనే!" అన్నది సీతాకోకచిలుక.

"ఈసారి నేను అడుగుతాను- నేను ఎట్లా ఉంటే మీకు ఇష్టం అవుతాను?" అడిగింది రోజా.

"రోజా పాప లాగా ఉంటే!" చటుక్కున సమాధానం చెప్పేసింది సీతాకోక చిలుక, నవ్వుతూ. "పిల్లల్లాగా ఉంటే ఎవరైనా ఇష్టమే అవుతారు"

అంతలో రోజాకి మెలకువ వచ్చేసింది. "ఓహ్! ఇదంతా కల!" అనుకున్నది. చూస్తే అప్పటికే లేచి చదువుకుంటున్నాడు అన్న.

"ఒరేయ్! కలలు నిజం కావాలంటే ఏం చెయ్యాలిరా?" అడిగింది వాడిని.

"పని చెయ్యాలమ్మా! పని!" అన్నాడు వాడు, మళ్ళీ పుస్తకంలో మునుగుతూ.

"వీడికి ఎట్లా తెలుసు?" అనుకున్నది రోజా. "పెద్దవాడు కదా, సీతాకోక చిలుక ఇదివరకెప్పుడో చెప్పి ఉంటుంది!" అనుకొని మళ్ళీ కొంచెం కునికింది. కలలో సీతాకోక చిలుకలు ఈసారి పనులు చేస్తూ కనబడ్డాయి దానికి!



# అద్భుతం

రచన: ఎ.సిరిల్‌డిసోజ, చెన్నేకొత్తపల్లి.

చిలమత్తూరు సామాన్యంగా పచ్చగానే ఉండేది. అయితే ఏమైందో ఏమో, ఈమధ్య కొన్నేళ్ళుగా వర్షాలు లేవు. పచ్చదనం బాగా తగ్గిపోయింది; పంటలు పండక ఊళ్ళో జనాలంతా బాధలో కూరుకుపోయారు. బాధలో బాధ- ఇంకోటి పట్టుకుంది. అదేంటో చూడండి-

ఆరోజున చిలమత్తూరు పిల్లలు కొందరు క్రికెట్ ఆడేందుకు వెళ్ళారు. రెండు జట్టులుగా విడిపోయి ఆటను ప్రారంభించారు. బౌలర్ వేసిన బంతిని చాలా గట్టిగా కొట్టాడు సర. అది గాలిలోకి ఎగిరి, ఎక్కడో నేలమీద పడి దొర్లుకుంటూ చాలా దూరమే వెళ్ళింది. అటువైపు ఉన్న ఫీల్డర్ దాని వెంట పరుగుతీశాడు- మిగిలిన వాళ్లంతా అక్కడే నిలబడి చూస్తున్నారు. ఎంతసేపటికీ ఫీల్డర్

వెనక్కి తిరిగి రాలేదు. చివరికి అందరూ వెళ్ళి చూసారు-

అక్కడ నేలకు ఒక పెద్ద రంధ్రం ఉంది. ఫీల్డర్ రోహిత్ ఆ రంధ్రం ప్రక్కన కూర్చొని తల పట్టుకొని ఏదో ఆలోచిస్తున్నాడు. అందరూ వాడి దగ్గరికి వెళ్ళి "అరేయ్, ఏమిరా, బంతిని వెతకటం మానేసి ఈ రంధ్రం వద్ద కూర్చొని ఏమి చూస్తున్నావురా?" అని అడిగారు.

వాడు అన్నాడు "అరేయ్, ఈ రంధ్రంలో ఏముంటుందా అని ఆలోచిస్తున్నాను. మన అయ్యవారు చెప్పారు కదరా, 'పూర్వకాలంలో రాజులు బంగారాన్ని , వజ్రాలను రకరకాల చోట్ల దాచిపెట్టారు 'అని? నాకు ఎందుకో చాలా నమ్మకంగా ఉందిరా, ఇది కూడా అలాంటి చోటే అని!" అని. ఇంకేముంది, అందరూ వాడి చుట్టూ మూగారు. అందరూ ఆ రంధ్రంలోకి నిక్కి నిక్కి చూశారు. అందరికీ రోహిత్‌కు వచ్చిన అనుమానమే వచ్చింది. అందరూ వాళ్ల పెద్దవాళ్లకి చెప్పారు- ఊళ్ళో పెద్దవాళ్లంతా వచ్చి చూసారు- ఇంకా అనుమానపడ్డారు.

"ఇన్ని సంవత్సరాలుగా ఎవరూ చూడనిదాన్ని పిల్ల వాడు రోహిత్ కనుక్కోవటం- నిజంగా ఊరికి మంచి రోజులు రానున్నాయి" అనుకున్నారు అందరూ. 'అక్కడ నిజంగానే నిధి ఉంది. లేకపోతే ఇంతమంది పెద్దవాళ్ళు ఎందుకు వచ్చి చూస్తారు?' అనుకున్నారు పిల్లలు.

సర్పంచి గారు గ్రామస్తులందరినీ పిలిచి మాట్లాడారు. "గ్రామస్తులారా! మనందరికీ తెలుసు. కొద్ది సంవత్సరాలుగా మనకు మంచి వానలు లేవు. ఈ ఏడాదైతే పంట పూర్తిగా నష్టమే అయ్యింది. ఇప్పుడు దేవుడు మనకోసం ఇదేదో మార్గం చూపిస్తున్నట్లు నాకు అనిపిస్తున్నది. కాబట్టి అందరం కలసి ఇక్కడ త్రవ్వుదాం. దొరికినవాటిని అందరం సమంగా పంచుకుందాం. త్రవ్వడానికి అయ్యే ఖర్చును కూడా అందరం సమానంగా పంచుకుందాం" అన్నారు. అందరూ సరేనన్నారు; వెంటనే అక్కడ త్రవ్వకాలు మొదలుపెట్టేశారు కూడాను!

ఒక రోజు గడచింది.. త్రవ్వకాల్లో ఏమీ

దొరకలేదు. రెండో రోజు ముగిసే సమయానికి ఆ ప్రదేశానికి ఒక ప్రక్కగా పెద్ద భోషాణం ఒకటి కనబడింది. అందరూ హడావిడి పడ్డారు; భోషాణాన్ని బయటికి తీసి చూశారు. దానిలో బంగారం, వజ్రాలు- ఏమీ లేవు! పూర్వ కాలపువి, ఏవో తాళపత్ర గ్రంధాలు ఉన్నాయి. అందరూ నిరాశ పడిపోయారు.

కొందరు అన్నారు- "పర్వాలేదు- ఇదేదో దొరికింది కదా అని ఆపకూడదు. ఇంకొంచెం త్రవ్వితే నిజం నిధి దొరకచ్చు!" అని. మూడో రోజు పని నిస్సారంగా గడిచింది- ఏమీ దొరకలేదు. అప్పటికి ఖర్చు ఐదు లక్షల రూపాయల వరకు అయ్యింది. "పని ఆపెయ్యండి- చాలు! అసలు ఇక్కడ ఏమీ లేదు!" అన్నారు కొందరు. "కాదులే, ఇంకొక్క రోజు త్రవ్వి చూద్దాం; ఏమీ దొరక్కపోతే ఆపేద్దాం" అన్నారు కొందరు. ఆ తర్వాతి రోజు పని ముగిసే సమయానికి, గుంతలో లోతుగా ఇరుక్కుని కనబడింది- ఉండలాగా గుండ్రంగా ఉన్న వస్తువు ఒకటి! అయితే ఆ సరికే బాగా చీకటి పడింది.

"దాన్నేదో రేపు తీద్దాం. మనకు అసలు ఈ ఆలోచన ఇచ్చింది రోహిత్ కదా, రోహిత్ చేత తీయిద్దాం, దాన్ని!" అన్నారు సర్పంచి గారు.

ప్రజలందరూ ఆరోజు రాత్రి అక్కడే నిద్రపోయారు. ఎవ్వరూ భోజనానికి కూడా పోలేదు.

మరుసటి రోజు ఉదయాన్నే రోహిత్ టార్చిలైటు చేత పట్టుకొని రంధ్రం దగ్గరికి వెళ్ళాడు. తాడు సహాయంతో రంధ్రంలోకి, వీలైనంత క్రిందికి జారాడు. అక్కడినుండి లోనికి చెయ్యి చాపితే రోహిత్‌కు అందింది, ఆ వస్తువు! 'ఎంత బరువు ఉంటుందో' అనుకున్నాడు గానీ, వాడు దానిని సులభంగానే తీయగలిగాడు!

"ఏంటిరా, దొరికిందా ఉండ?" అడిగారు పెద్దవాళ్లందరూ, పైనుండి.

"దొరికిందండీ" అన్నాడు రోహిత్ నీరసంగా.

"మరేది, అందివ్వు, దాన్ని ఇలా!" అన్నారు జనాలు. రోహిత్ దాన్ని పైకి అందించాడు.

ఏంటనుకున్నారు, అది క్రికెట్ బంతి!

"ఒరేయ్! ఈ బంతితోనేరా, మనం ఆ రోజు ఆడింది! మన బంతి మనకు దొరికిందిరోయ్!" అని సంతోషంగా అరిచారు పిల్లలంతా.

పెద్దలంతా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అందరూ మౌనంగా గుంతకేసి చూశారు. "ఒరేయ్, రోహిత్! నిజంగా అక్కడ ఇంకేమీ కనబడటం లేదా?" అన్నారు నిరాశగా.

"ఇక్కడ కొంచెం తేమ తప్ప మరేమీ లేదు. ఏదీ, గడారి (గునపం) ఇటివ్వండి ఓసారి!" అన్నాడు రోహిత్. ఎవరో గడారిని అందించారు వాడికి.

తేమ ఉన్న చోట వాడు గునపంతో ఒక పోటు పొడిచాడో, లేదో- పెద్ద నీటి జల ఒకటి బయలు దేరింది అక్కడినుండి! ఉవ్వెత్తున లేచిన నీళ్ళు ఏనుగు తొండంలోంచి పడుతున్న ధార మాదిరి అందరినీ ముంచెత్తాయి. కరువుతో నీటికి ముఖం వాచి ఉన్న జనాలు ఆ నీళ్లలో తడుస్తూ గంతులు వేశారు. పిల్లలు నీళ్లలో ఉత్సాహంగా ఈతలు కొట్టారు.

మరునాటికల్లా దానిచుట్టూ ఒక మంచినీటి సరస్సు తయారైంది. ప్రభుత్వం వారి సహాయంతో దానిచుట్టూ అవసరమున్న చోట్లల్లా కట్టలు, గేట్లు తయారయ్యాయి. అటుపైన చిలమత్తూరుకు ఇక నీటి సమస్యే లేకుండా పోయింది. ఊరి బీళ్ళన్నీ సస్యశ్యామలాలైనాయి.

పిల్లలు చేసే చిన్న చిన్న అల్లరి పనులు అప్పుడప్పుడూ సమాజానికి బాగా ఉపయోగపడతాయి!

"కాయలు కాని కాయలు ఏంటి?"
"టపాకాయలు"

కోడి కాని కోడి ఏంటి?
"పకోడి"

కాయ కాని కాయ ఏంటి?
"తలకాయ"



# మనం గొప్ప

*"నువ్వు గొప్పా, నేను గొప్పా?" అనుకోవటం లోంచి "మనం గొప్ప"కి మారటం నిజంగా గొప్పే. ఇదిగో, చూడండి ఈ కథ.*

*రచన: గంగిపుల్లయ్య, ఉపాధ్యాయుడు, గడ్డం నాగేపల్లి, నార్పల, అనంతపురం జిల్లా.*

గాలి, నీళ్ళు మంచి స్నేహితులు. ఇద్దరూ అనేక జీవరాసులకు ఉపయోగ-పడుతుంటారు.

అయితే మనుషులు నీళ్లను గురించే ఎక్కువగా మాట్లాడుతున్నారు: "ఆ ఊళ్లో నీళ్ళు ఎక్కువగా ఉన్నాయి- పంటలు బాగా పండుతున్నాయి. వాళ్లంతా ధనవంతు-లయ్యారు. నీళ్ళు లేని ఊళ్లలో మనుషులు, పక్షులు, జంతువులు, పంటలు లేక కష్టపడుతున్నారు-" ఇలాగ.

ఈ మాటలు విన్న నీటికి గర్వం పెరిగింది. 'గాలి కంటే నేనే ఎక్కువ' అనుకోవటం

మొదలుపెట్టింది.

చివరికి అది ఒకరోజు గాలి దగ్గరికి వెళ్ళి అన్నది: జీవరాసులకు మన ఇద్దరిలో ఎవరు ముఖ్యం? చెప్పు!" అని.

"ఇద్దరమూ అవసరమే" అన్నది గాలి.

"అయ్యో, 'మనిద్దరం' అని కలుపుకుంటా-వెందుకు? నీకు ఆకారమే లేదు. నువ్వు అసలు కంటికే ఆనవు. నీ గురించి అయితే ఎవ్వరూ మాట్లాడుకోనే మాట్లాడుకోరు. నీ అవసరం నీకే!" అన్నది నీరు, నవ్వుతూ. "నన్ను చూడు- ఏ పాత్రలోకి పోస్తే ఆ ఆకారంలో ఉంటాను. నేను లేకుంటే పంటలు ఎండిపోతాయి; చెట్లు బ్రతకలేవు ; పక్షులు-జంతువులు బ్రతకలేవు. మరి నేను తలచుకుంటే చాలు- పంటలు పండించ-గలను; వరదలు, కరువు కాటకాలు తెప్పించగలను. జీవరాసులన్నిటి కష్ట సుఖాలలోనూ నా పాత్ర చెప్పలేనంత ఉంది. అవసరం అంటే నేనే కద, నిన్ను నువ్వు కలుపుకునేదెందుకు?" అని విర్రవీగింది.

దాని మాటలకు గాలి నొచ్చుకున్నది, చిన్నబోయింది. "మిత్రమా! జీవరాసులకు నీ అవసరం చాలా ఉన్నది. అయినా నేను కూడా ముఖ్యమే" అన్నది మెల్లగా.

నీరు ఇంకొంచెం వెటకరించింది- "అలా అనకు! జీవరాసులకే కాదు, నీకు కూడా నా అవసరం ఎంతో ఉంది!! ఎందుకంటే, నేను లేకుంటే చెట్లు బ్రతకవు- గాలి వీచదు మరి!!" అని సంతోషపడింది.

గాలి ఉడుక్కున్నది- "ఎవరి ప్రాధాన్యత వారిదిలే- ఈ మాటలు చాలు , ఇంతటితో ఆపుదాం" అని మౌనం వహించింది.

నీళ్ళు మరింత రెచ్చిపోయినై- "ఏనాడూ కంటికి కనిపించవే, నువ్వేనా- ఎవరి ప్రాధాన్యత వారికి ఉంటుందనేది!? ఎట్లా ఉంటుంది ప్రాధాన్యత? నన్ను చూడు- నేను సూక్ష్మ రూపంతో, కంటికి కనిపించకుండా ఆవిరి అవుతాను- మేఘాలను చేరతాను. ద్రవంగా ఉంటూ ప్రవహిస్తాను. గడ్డకట్టి, ఘన పదార్థంగా మారి మనుషుల అవసరాలు తీరుస్తున్నాను. నేను లేనిదే సృష్టేలేదు. పోటీ పెట్టుకుందాం! ఎవరు గొప్పో ఇప్పుడే

తేలిపోతుంది!" అంది.

గాలికి పోటీ పందేలంటే ఇష్టం లేదు. "ఇంత మాత్రం దానికి పోటీ ఎందుకులే, నువ్వే ఎక్కువ" అన్నది.

నీరు నవ్వింది ఎగతాళిగా "ఓహో, ఏం తెలివి! ఎట్లాగూ ఓడిపోతానని ఎంత ఉలుకో చూడు! 'పోటీ ఎందుకు' అని వగలు పోతున్నావు!" అంది నిష్టూరంగా.

ఇంక పోటీకి ఒప్పుకోక తప్పలేదు గాలికి.

'ఆహారమయ్య' అనే రైతుకుటుంబం మీద ప్రయోగం చేయాలని నిర్ణయించుకున్నారు ఇద్దరూ. ఆహారమయ్య భార్య లేస్తూనే- నీళ్ళు కాస్తుంది, వంటచేస్తుంది. ఆహారమయ్య తోటకు నీరు పెడతాడు. పిల్లలు ఉడుకు నీళ్ళతో స్నానాలు చేస్తారు. భోజనాలు చేసి నీళ్ళు త్రాగుతారు. స్కూలు కెళుతూ నీళ్ల తీసుకెళ్తారు. అయితే ఆరోజు కొంతసేపు నీళ్ళు వచ్చాయి- తర్వాత ఆగిపోయాయి. తోట సగానికి పైగా తడవనే లేదు. రైతుకే కాదు, రైతు భార్యకు, పిల్లలకు అందరికీ చాలా కష్టమైంది. "నీళ్ళు లేవు-నీళ్ళు లేవు " అని గగ్గోలు పడ్డారు. "చూశావా, నేను ఎంత గొప్పదాన్నో! ఎంత మంది నామీద ఆధారపడి బ్రతుకుతున్నారో చూశావా!" అన్నాయి నీళ్ళు.

"అవునవును- నిజం. నువ్వే అవసరం వాళ్ళకి!" అన్నది గాలి.

"ఇప్పుడు నీ వంతు. నీ బలం ఎంతో చూపించు!" అన్నది నీరు.

"ఎందుకూ, పాపం చాలా కష్టం అవుతుంది. వద్దులే" అన్నది గాలి.

నీరు ఊరుకోలేదు. చివరికి గాలి ఒప్పుకున్నది- "పదే పది క్షణాలు- ఏమౌతుందో చూడు, జాగ్రత్తగా" అన్నది. ఆహారమయ్య కుటుంబం నుండి మాయమైంది.

అంతే! అందరూ గొంతులు పట్టుకున్నారు. "అ..అ..అః.." అన్నారు. క్రింద పడిపోయారు. ఊపిరాడక, వాళ్ల ముఖాలు నీలం రంగుకు తిరిగాయి. స్పృహ తప్పారు. అంతలోనే గాలి తిరిగి వచ్చింది. వాళ్ల ప్రాణాలు కాపాడింది.

నీరు అవాక్కయింది. గాలి వివరించింది- "మిత్రమా! ప్రపంచంలో ఏది కదలాలన్నా నేను అవసరమే. జీవుల శరీరాలలోను, ఖాళీగా కనబడే స్థలాలన్నిటిలోనూ- అంతటా నేను ఉన్నాను, కంటికి కనబడను అంతే. నేను లేనిదే ప్రాణమే లేదు. అంతెందుకు, నీలోనే నేనున్నాను. ప్రాణుల మనుగడ నేను లేనిదే అసలు వీలవదు" అన్నది.

"మిత్రమా! నన్ను క్షమించు. నువ్వు కంటికి కనబడవు కదా, నీ గొప్పను గుర్తించలేకపోయాను నేను. నాకంటే నువ్వే గొప్పదానివి!" అన్నది నీరు, సిగ్గుపడుతూ.

గాలి నవ్వింది- "లేదు మిత్రమా! మనం ఇద్దరమూ గొప్ప వాళ్లమే. మనం ఇద్దరం లేకపోతే ఈ భూమికి, మిగతా గ్రహాలకు తేడా ఉండేది కాదు. ప్రాణికోటి మనుగడకు మనం ఇద్దరమూ అవసరమే!" అన్నది.



నవ్వనే నవ్వం!

టీచర్:సాగే గుణం వేటికి ఉంటుందిరా?
స్టూడెంట్: టీవీ సీరియల్స్‌కు!

మూడేళ్ళ సృజన దీపావళి రోజు రాత్రి అంటోంది...
సృజన: అబ్బ! చేతులు ఎంత నొప్పి పెడుతున్నాయో!
అమ్మమ్మ: ఎందుకమ్మా!? అన్ని టపాకాయలు కాల్చావనా?
సృజన: ఉహుఁ..అంతసేపు చెవులు మూసుకున్నాను కదా, అందుకని!

పుల్లయ్య: డాక్టర్ గారూ, మా అల్లుడికి పిచ్చి పట్టిందండీ!
డాక్టర్: అలాగా, ఎక్కడున్నాడు అతను?!
పుల్లయ్య: ఇదిగో,నా జేబులో!!



# సద్భావన

*మూలం: బుద్ధిస్టు పారాబుల్స్.* *తెలుగు అనుసరణ: నారాయణ, కొత్తపల్లి బృందం.*

సిద్ధార్థుడిగా పుట్టటానికి అనేక జన్మల ముందు, బోధిసత్త్వుడు ఒకసారి సెస్సెన్ దోజి అనే సన్యాసిగా జీవించాడు. ఆ రోజుల్లో మోక్షాన్ని కోరేవాళ్ళంతా 'బ్రాహ్మణాలు, అరణ్యకాలు' లాంటి శాస్త్రాలను వల్లె వేస్తుండేవాళ్ళు. సెస్సెన్‌దోజి కూడా వాటినన్నిటినీ చదివాడు, వాటి ప్రకారం పవిత్రంగా జీవిస్తూ, తన పుణ్యసంపదను పెంచుకుంటూ వచ్చాడు. ఇప్పుడు అతని పారమితలు ఏ స్థాయిని చేరుకున్నాయంటే, ఇక అతనికి ఇంకా లోతైన సత్యాలు తెలియవలసి ఉన్నది.

అయితే అంత గొప్ప సత్యాలు అందరికీ అనుభూతిలోకి రావు. వాటిని తెలుసుకోవాలంటే కొంత అర్హత ఉండాలి. దోజికి ఆ అర్హత ఉన్నదో లేదో తెలుసుకోవాలనుకున్నాడు, దేవతలరాజు ఇంద్రుడు. ఒక రోజున అడవిలో కట్టెపుల్లలు ఏరుకునేందుకు పోయిన దోజి ముందు ప్రత్యక్షమయ్యాడు, భయంకరమైన బ్రహ్మ రాక్షసుడి వేషంలో.

"హహ్హహ్హహ్హ" నవ్వాడు బ్రహ్మ రాక్షసుడు- "నీ పేరు దోజి కదూ! నీకు పరిపూర్ణ జ్ఞానం సంపాదించుకోవాలని ఉన్నదటనే, నిజమేనా?" అన్నాడు దోజితో.

"అవునండి!" అన్నాడు దోజి.

"నువ్వు ఏవేవో శాస్త్రాలన్నీచదివావట గదా, పరమ సత్యాన్ని నేరుగా చూపించే శ్లోకం ఒకటుంది. అదేంటో చెప్పు, చూద్దాం" అన్నాడు రాక్షసుడు.

"నాకు అట్లాంటివేవీ తెలియదండి" ఒప్పుకున్నాడు దోజి.

"అయ్యో! నాకు తెలిసినపాటి సత్యం కూడా తెలీదా, నీకు?!" అన్నాడు బ్రహ్మరాక్షసుడు, ఒకింత వెటకరిస్తున్నట్లు.

"చూడగా తమరు గొప్ప జ్ఞానులనిపిస్తున్నది. మీరు ఆ శ్లోకం ఏదో చెప్పారంటే నేను దాని సారాన్ని అందుకొని, నాజన్మను ధన్యం చేసుకుంటాను" అన్నాడు దోజి శ్రద్ధను కనబరుస్తూ.

"సరే, అయితే చెబుతాను కొంచెం. చూడు, ఇప్పుడు నేను చెప్పేది పరమ సత్యమే తప్ప, వేరేమీ కాదు- అర్థం అవుతున్నదా?" అన్నాడు రాక్షసుడు.

దోజి ఆ సరికే తన మనసునంతా రాక్షసుడి మాటలమీద కేంద్రీకరించి ఉన్నాడు.

"ఈ విశ్వంలో ప్రతీదీ మార్పు చెందుతూనే ఉన్నది. స్థిరంగా ఉన్నదంటూ ఏదీ లేదు. జనన మరణాల రహస్యం ఇదే" అని శ్లోకంలో మొదటిభాగం చెప్పాడు రాక్షసుడు.

"ఓహో!" అనుకున్నాడు దోజి, రెండవ భాగం కోసం ఎదురు చూస్తూ.

బ్రహ్మరాక్షసుడు రెండో భాగాన్ని చెప్పనే లేదు! కొంచెం సేపటికి తేరుకున్న దోజి మిగిలిన ముక్కను చెప్పమన్నాడు.

"ఉహుం. ఊరికే నేనెందుకు చెబుతాను?" అన్నాడు బ్రహ్మరాక్షసుడు, మొండికేస్తున్నట్లు.

దోజి హతాశుడయ్యాడు- "అయ్యో! ఇంతకాలంగా నేను వెతుకున్నది దానికోసమే. దానికోసం నేను ఏమైనా ఇచ్చేస్తాను. మీకు ఏంకావాలో అడగండి" అని ప్రాధేయపడ్డాడు.

"సరే, నేను నీకు ఆ శ్లోకంలో రెండో భాగాన్ని చెప్పినందుకుగాను నీ శరీరాన్ని నాకు ఆహారంగా ఇచ్చెయ్యాలి నువ్వు" అన్నాడు రాక్షసుడు, ఆశగా.

"దానిదేముంది, ఇచ్చేస్తాను" అని మాట ఇచ్చేశాడు దోజి.

"అయితే విను- జననమరణాల చక్రం నుండి బయటపడిన వాళ్లకు నిర్వాణం లభిస్తుంది" అని శ్లోకాన్ని పూర్తిచేశాడు రాక్షసుడు.

దోజి ఆ శ్లోకాన్ని, దాని భావాన్ని చాలాసార్లు మననం చేసుకున్నాడు. దాన్ని అర్థం చేసుకున్నకొద్దీ అతనికి మరింత లోతైన సత్యం ఏదో తెలుస్తున్నట్లు అనిపించింది.

అయితే తను ఇప్పుడు రాక్షసుడికి ఆహారం అవ్వవలసి ఉన్నది. "ఇంత గొప్ప రహస్యాన్ని తెలుసుకున్నాక, వెంటనే వృధాగా మరణిస్తే ఏం ప్రయోజనం? ఆ సత్యాన్ని నాలోకి ఇంకించుకోవాలి గద! అయినా ఏమీ పరవాలేదు- ఈ శ్లోకాన్ని పదిమందికీఅందేలా చెట్లమీద, బండలమీద రాస్తాను. నాకు ఇప్పుడు అంత అదృష్టం లేకపోయినా, మరెవ్వరికో దీనివల్ల మేలు కలిగితే చాలు" అనుకున్నాడు దోజి.



అనుకున్నదే తడవు, దాన్ని అమలు పరచాడు. దగ్గర్లో ఉన్న బండలమీదా, చెట్లమీదా ఈ

శ్లోకాన్ని చెక్కాక, అతను ఒక ఎత్తైన చెట్టు ఎక్కి, నేరుగా బ్రహ్మరాక్షసుడి నోట్లోకి దూకాడు.

మరుక్షణం అసలు రూపాన్ని ధరించిన ఇంద్రుడు దోజిని క్రిందపడకుండా పట్టుకొని నిలబెట్టాడు. "నిర్వాణం సాధించాలంటే చాలా పుణ్యం చేసుకోవాలి. 'నాకు కాకపోతే పోయె- ఇతరులకు ఏ కొంచెం మేలు కలిగినా చాలు' అన్న సద్భావనతో నువ్వు చేసిన ఈ పని వల్ల నీ అర్హత నిరూపితం అయ్యింది. నీ యీ పుణ్యఫలంగా ఏదో ఒక జన్మలో నువు తప్పక పరిపూర్ణ జ్ఞానివి అవుతావు!" అని ఆశీర్వదించి అంతర్ధానం అయిపోయాడు .

నిజంగానే అనేక జన్మల అనంతరం సిద్ధార్థుడు బుద్ధత్వాన్ని సాధించాడు!

## సుభాషితం

ఆత్మశుద్ధిలేని ఆచారమది యేల
భాండశుద్ధిలేని పాకమేల?
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినుర వేమ!

పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడె పుట్టదు- జనులా
పుత్రుని కనుగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ!

కష్టపెట్టబోకు కన్నతల్లి మనసు
నష్టపెట్టబోకు నాన్నపనులు
తల్లిదండ్రులన్న దైవ సన్నిభులురా
లలిత సుగుణజాల తెలుగుబాల!

బద్ధకము సంజ నిద్దుర
వద్దు సుమీ దద్దిరంబు వచ్చున్‌దానన్
వద్దందురు ఇంటివారు
మొద్దందురు తోటివారు ముద్దు కుమారీ!

## పెద్దల మాట -చద్ది మూట

# కడుపునొప్పికి... వాము

కథనం: నారాయణ.
బొమ్మలు: వినయ్, జెయన్‌టియు.



























# ఇక్బాల్ మసీహ్

*నిర్వహణ: శ్రీమతి సౌమ్య, పుస్తకం డాట్ నెట్* *సౌజన్యం: శ్రీ.K.V.M.కిశోర్, అనంతపురం.*

ఇక్బాల్ మసీహ్ 1982 లో పాకిస్తాన్ లోని లాహోర్ నగరం దగ్గరున్న మురిద్కె అనే కుగ్రామంలో ఒక నిరుపేద కుటుంబంలో జన్మించాడు. అతనికి నాలుగు సంవత్సరాల వయసు ఉన్నప్పుడు, అతని తండ్రి అతన్ని 400 రూపాయలకు అమ్మేశాడు- ఒక తివాచీలు తయారు చేసే కర్మాగారానికి. ఇక్బాల్ కు ఊహ తెలియక ముందే బానిస బ్రతుకులోని బాధ తెలిసింది. తనతో పాటు ఎందరో పిల్లలు అక్కడ వెట్టిచాకిరీ చేసేవాళ్ళు. వెట్టిచాకిరి అంటే పనికి జీతం ఉండదు- కేవలం తినడానికి, ఉండటానికీ చాలీ చాలని వసతి కల్పిస్తారు.

ఆ కర్మాగారంలో ఇక్బాల్, అతని తోటి పిల్లలు- అందరూ రోజుకు పన్నెండు గంటలు పని చేసేవాళ్ళు. 'పనివేళల్లో పిల్లలు పనిచెయ్యకుండా ఆడుకుంటే ఎలాగ?' అని వాళ్ళను

దూరదూరంగా, మగ్గాల దగ్గర గొలుసులతో కట్టిపడేసే వాళ్ళు. ఈ పిల్లలందరూ అక్కడే అలా నిల్చోటానికి, కూర్చోటానికి- చివరకు కదలటానికి కూడా వీలులేని పరిస్థితుల్లో పని చెయ్యాల్సి వచ్చేది.

ఇక్బాల్‌కు పదేళ్ళ వయసు ఉన్నప్పుడు వాడు కొందరు స్నేహితులతో కలిసి తివాచీ పరిశ్రమనుంచి తప్పించుకున్నాడు. వాళ్ళందరూ ఒక సంస్థ నిర్వహించిన కార్యక్రమంలో పాల్గొన్నారు. అందులో మొట్టమొదటిసారి ఇక్బాల్‌కు తెలిసింది- పిల్లలకు కూడా స్వతంత్రంగా బ్రతికే హక్కు ఉందని, తనకు కూడా స్వేచ్ఛగా బ్రతికే అధికారం ఉందని!

అనుకోకుండా అక్కడ ఇక్బాల్‌కు మాట్లాడే అవకాశం వచ్చింది. అనర్గళంగా, ఉద్వేగంగా సాగింది, అతడి ప్రసంగం! అది అక్కడున్నవాళ్ళను అందరినీ కదిలించింది. తివాచీల కార్ఖానాల్లో నలిగిపోతున్న తనలాంటి వాళ్ళ జీవితాల గురించి ఇక్బాల్ చెప్పిన మాటలకు పాకిస్తాన్ ప్రజల్లో అనూహ్యస్పందన లభించింది.

ఇక అక్కడనుంచి ఇక్బాల్ వెనుతిరగలేదు. తన వాక్పటిమతో ఎందరినో ప్రభావితం చేశాడు. కేవలం పాకిస్తాన్‌లోనే కాకుండా ప్రపంచంలోని చాలా దేశాలలో పర్యటించాడు. బాల కార్మికుల పరిస్థితులను వెలుగులోకి తెచ్చాడు. ఎంతో మందికి స్ఫూర్తినిచ్చాడు. ఎందరో మేధావులను కలుపుకున్నాడు. పాకిస్తాన్‌లోని తివాచీల పరిశ్రమ ఒక్కసారిగా గడగడలాడింది.

రెండు సంవత్సరాల తరువాత, 1995 లో ఇక్బాల్‌ను "కొందరు గుర్తు తెలియని వ్యక్తులు" ఎవరో తుపాకులతో కాల్చి చంపారు. అప్పుడు ఇక్బాల్ వయసు కేవలం పన్నెండేళ్ళు.

"ఇంకెవరు చేస్తారు? ఇది తివాచీ పరిశ్రమలకు చెందిన దుండగుల పనే" అని ఎంతమంది అనుకున్నా, దేనికీ బలమైన సాక్ష్యాలు లేవు- అందుకని ఈ దుశ్చర్యకు బాధ్యులు ఎవరో నిర్ధారణ కాలేదు.

అలుపెరగకుండా పోరాడిన చిన్నారి విప్లవకారుడు ఇక్బాల్ అలా కన్నుమూసినా, అతను రేకెత్తించిన విప్లవం మాత్రం ఆగలేదు. అమెరికా, కెనడా దేశాలలో అతని వల్ల ప్రభావితమైన విద్యార్థులు ఎందరో అతడి కలను నిజం చెయ్యాలని దీక్షబూనారు. ఇక్బాల్ స్ఫూర్తితో మసాచుసెట్స్ విద్యార్థులు కొందరు పాకిస్తాన్‌లో బాలకార్మికుల కోసం ఒక బడి నిర్మించారు. వారి పట్టుదల చూసి ఇంకొందరు తోడైనారు. ఆ సమూహం ఇప్పుడు పాకిస్తాన్‌లోని పలు నగరాల్లో బాల కార్మికుల కోసం ఎనిమిది బడులు నడుపుతున్నారు. ఇక్బాల్‌కు రీబాక్ మానవ హక్కుల అవార్డు, మరణానంతరం World's Children's Prize for the Rights of the Child అవార్డు లాంటివి ఇచ్చారు. అమెరికా దేశం అయితే ఇక్బాల్ పేరు మీద Iqbal Masih Award for the Elimination of Child Labor అనే ఒక వార్షిక పతకాన్నే నెలకొల్పింది!

దారిద్ర్యంలోంచీ , దుర్మార్గంలోంచీ బాల కార్మికుల వ్యవస్థల్లాంటివి తలెత్తుతాయి. అలాంటివేవీ లేని మంచి ప్రపంచం ఉంటే ఎంత బాగుండు! అలాంటి ప్రపంచం కోసం మరెందరు ఇక్బాల్‌లు తయారు కావాలో, మరి?

**<u>'కనుక్కోండి చూద్దాం'_కు జవాబులు:</u>**

| | | |
|---|---|---|
| 1: కొబ్బరికాయ | 2: 6! | 3: ముఖం- పళ్ళు, ముక్కు రంధ్రాలు, కంటిగుడ్లు, కను బొమ్మలు, జుట్టు. |
| 4: గొడుగు | 5: సంవత్సరం, నెలలు, రోజులు. | 6: వడ్లగింజలు |
| 7: అట్లాస్ | 8: పొట్లకాయ | 9: గోనెసంచి. |
| 10: పొగ | 11: ఆవలింత | 12: నీరు |
| 13: ఆకాశం, చంద్రుడు, చుక్కలు | | |

# చిలిపి ప్రశ్నలు-తిక్క జవాబులు

*నిర్వహణ: శ్రీవివియస్మూర్తి, చొదిమెళ్ళ.*

1.పేరెంట్ అయోమయంలో పడేదెప్పుడు!?

జవాబు: "మీ వాణ్ణి 'ఐ.ఐ.టి L.k.G లో' చేరుస్తారా 'ఆర్డినరీ L.k.G లో' చేరుస్తారా?" అని హెడ్మాస్టారన్నప్పుడు.

2.ఆశ్చర్యం కలిగించే విషయం!?

జవాబు: గూడ్స్డ్రయివర్ ఫాస్ట్ఫుడ్ తినటం!!

3. సైన్సుమాస్టారు భార్యని ఎలా పొగుడుతాడు!?

జవాబు: "ఇంటికి సోలార్ దీపం ఇల్లాలు"

4.గడియారాలు రిపేర్ చేసేషాపు ముందు బోర్డు!?

జవాబు: మీటైం బాగోపోతే మమ్మల్ని సంప్రతించండి!!

5.ఫారెస్ట్ ఆఫీసర్ అయోమయంలో పడేదెప్పుడు!?

జవాబు: కొత్త అల్లుడు 'పిట్టమాంసం' కోరినప్పుడు!

6.జలుబు చేసిన పిల్లాణ్ణి డాక్టరు దగ్గరకు తీసుకెళ్లిన తల్లి, అయోమయంలో పడేదెప్పుడు!?

జవాబు: "బాబుని ఐస్క్రీం, కూల్డ్రింక్ యాడ్లు చూడనివ్వకండి" అని డాక్టరు అన్నప్పుడు!!

7."మేడ్ఫర్ ఈచ్ అదర్" అంటే.....!?

పెళ్ళికూతురు డాక్టరు, పెళ్ళికొడుకు మందులషాపు ఓనరు!!

# పదరంగం-12

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ తెల్లకాగితంలో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-13 తో పాటు ప్రచురించగలం. నిర్వహణ: దేవి, బెంగుళూరు.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | ■ | 3 | | |
| ■ | | ■ | | ■ | ■ |
| 4 | | 5 | | ■ | 6 |
| | ■ | | ■ | 7 | |
| 8 | | | 9 | ■ | |
| | ■ | 10 | | | |

**ఆధారాలు:**

**అడ్డం:**

1. నిన్నటికి ఎల్లుండి (2)
3. ఊగేది (3)
4. 'మొదటి' వారం (4)
7. పాఠశాల (2)
8. మెలికపడిన 'కోతితోక' (4)
10. ఏడాది (4)

**నిలువు:**

2. భవనాలకు మూలము (3)
3. లేఖ, ఒక దిక్కు (3)
4. నదీ ప్రవాహానికి అడ్డంగా, నిర్మించే కట్టడం (4)
5. వీడికోసం కాదు (4)
6. సమయాన్ని తెలిపేది (4)
9. వత్తు లేని త్రోవ (2)

**పదరంగం-11 కి సమాధానం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 సం | క్రాం | తి | ■ | 2 పా | 3 ప |
| బ | ■ | ■ | 4 న | లు | సు |
| 5 రం | 6 గ | 7 వ | ల్లి | ■ | పు |
| ■ | 8 ద | రి | ■ | 9 వా | ■ |
| 10 వ | ■ | 11 చే | తి | క | ర్ర |
| 12 డి | గు | లు | ■ | లి | ■ |

# మొక్కను బాబూ

*సేకరణ: యస్.టి.పి.మనీష, పదోతరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*
*గానం: తేజ, సరిగమ, పదోతరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

మొక్కను బాబూ నన్ను తొక్కకు బాబూ
పిడికెడు నీళ్ళు విసిరితె చాలు మ్రానౌతాను- నీకు మేలౌతాను!

భూమి తల్లి గుండెలపై అల్లారుముద్దౌతా
సూర్యరశ్మి వేడిలోన శిరసెత్తి వికసిస్తా
చెడుగాలిని శుద్ధిచేసి నవ గాలులనే అందిస్తా
మొక్కను బాబూ ...!

పెరటిలోన చెట్టౌతా- చేనులోన మ్రానౌతా
పశుపక్షుల గూడౌతా- బాటసారి నీడౌతా
నీ నవ్వుల పువ్వౌతా నీ ఆశల పండౌతా
మొక్కను బాబూ ...!

కారడవిలో నీ కంటికి కనువిందు చేస్తాను
కలపైనా కర్రైనా నీ రక్షణ కోరేను
కడదాకా నీవెంట చితిమంటల పాలౌతా
మొక్కను బాబూ- నన్ను తొక్కకు బాబూ
నేను చెట్టౌతాను- నన్ను కొట్టకు బాబూ!



ఈ పాటను ఇంటర్నెట్లో వినే వీలున్నది! సందర్శించండి http://kottapalli.in

# సమీక్ష

*కొత్తపల్లి పత్రిక జనవరి 2012 సంచికపై ఒక సమీక్ష...*
*నిర్వహణ: శ్రీమతి మాలతీ కృష్ణ, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*




ఎంత గొప్ప ప్రయోజనం కోసమైనా సరే, మూసలో పోయబడ్డవాళ్ళు చైతన్య వంతులు కాలేరన్నది నిజం. కొత్త సంవత్సరాన్ని మంచి అంశంతో ప్రారంభించింది కొత్తపల్లి బృందం. మరియా మాంటిస్సోరీ అందించిన విద్యాసేవల గురించి మరికొంత స్పష్టమైన సమాచారం ఉంటే బాగుండేది.

రాజశేఖర్ గారి 'జ్ఞానం-పాండిత్యం' గురించి మొదటగా చెప్పకపోతే అన్యాయమే. చక్కని కథ చదివామన్న తృప్తి కలిగింది. ఆయనకు ప్రత్యేక అభినందనలు.

బజరాగారి 'భయం' కూడా బాగుంది. మనలో మనకే ఎన్ని భయాలు! ప్రక్కవాడు హానిచేస్తాడనో, ఎదుటివాడు ఎగతాళి చేస్తాడనో, తోటివాడు నవ్వుతాడనో ? భయం లేని చోటనే కదా, స్నేహానికి తావు ఉండేది! 'కథ లోతులు పిల్లలకు అర్థం అవుతాయా' అనిపించింది.

రాధగారి కథకు ముగింపు బాగుంది. కార్తీక్ లాంటి గొప్ప మనసున్నవాడికి స్టేట్ ర్యాంకు రాకపోయినా వాడి గొప్పతనమేం తక్కువవదు కదా!

నీతి చంద్రికలో పక్షులు కొంగని తిడుతూనే ఎన్ని నీతులు చెప్పాయి! 6 వ పేజీలోని ఒక్కో వాక్యం ఒక్కో సూక్తిలా ఉంది.

స్వచ్ఛమైన మనసు, స్పష్టమైన పరిశీలన ఉన్న వారెవరైనా అత్యంత సామాన్యమైన విషయాలనుండీ స్ఫూర్తిని పొంది తమ జీవితాన్నే మార్చేసుకోగలరు. సరితగారు మంచి కథనిచ్చారు.

లలిత గారి బొమ్మ ఉత్సుకతని రేపేదిగా ఉంది. మరి పిల్లలు ఎలా స్పందిస్తారో చూడాలి. బొమ్మలకి పిల్లలు కథలు రాయటం లేదెందుకు?

ఎమర్ జోన్స్ లాంటి వాళ్ల గురించి తెలియటం, 'సైంటిస్టులంటే అచ్చు పుస్తకాల్లో ఉండే వారే' అనే భావనని పోగొట్టి, 'మనలో ఒకరు అవ్వచ్చు!' అన్న అభిప్రాయం కలగ జేస్తుంది. సౌమ్య గారికి ధన్యవాదాలు.

స్రవంతి వ్రాసిన స్నేహితుడి సలహా లాంటివి గతంలో వచ్చినా, క్రొత్తగా ఆలోచించి, పాత్రలను ఆసక్తికరంగా సృష్టించింది. సాయి కార్తీక్ కథ 'రాము తెలివి'లో 'అరే! ఇంత చిన్న విషయం పెద్దవాళ్ళెవరికీ తట్టలేదే!' అనిపించింది. 'మారిన మనసు'లో రంగమ్మ, కరుణలు సహనంతో రంగయ్యని మార్చిన తీరు బాగుంది. అంత సులువుగా మనుషులు మారతారని శరత్ చంద్రిక పసి మనసుకు ఎలా తట్టిందో అనిపించింది.

ప్రగతి వ్రాసిన కథలోలాగా స్నేహితులతో కలిసి చదువుకోవటంలోని సరదా, సంతోషం ఇప్పటి పట్నం పిల్లలకు తెలిసే అవకాశం లేదు. స్టడీ అవర్స్ పేరిట ప్రొద్దున్న ఎనిమిది గంటలనుండి రాత్రి ఎనిమిది గంటల వరకూ లైన్లో కూర్చోబెట్టేసి, బెత్తం పట్టుకొని తిరిగే టీచర్ల పర్యవేక్షణలో చదవటం, పాపం ప్రగతికి తెలియదు కదా.

కీర్తి వ్రాసిన 'అన్న-తమ్ముడు'లో ఆవుచర్మం మీద చినుకులు పడటం, దొంగలు పారిపోవటం, ఇటీవలే ఎక్కడో చదివినట్లుంది. కొత్తపల్లిలోనే కాదుగదా..?

చివరగా, 'పగటికల' గురించి. ఉత్సాహం ఉరకలేసే వయసులో ఈ 'పగటి కల' పుస్తకం చదివితే "అర్జంటుగా టీచరైపోయి గిజూభాయి అయిపోదాం" అని అనిపించకమానదు- నిజంగా అదొక కమ్మటి కల!

కొత్తపల్లి బృందానికి అభినందనలు.

**ముద్రిత ప్రతుల వెల:**

ప్రతి ఒక్కొంటికి: 20 రూ.

12 పుస్తకాలకై చందా: 240 రూ.

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కొంటు వివరాలు:

"Kottapalli Trust",
A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670

ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు

సంపాదకత్వం: నారాయణ

వెబ్సైటు, సమాచార సాంకేతికత: ఆనంద్, లక్ష్మి

అక్షర కూర్పు: శ్రీలక్ష్మి

ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు

ముఖచిత్రం 'దూరదర్శనం': వీరాంజి

చిత్రాలు: అడవిరాముడు, రాము, వినయ్, రాజేష్, కల్యాణి, లక్ష్మి, వెంకట్.

బొమ్మకు కథ: జి.లలిత, telugu4kids

కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:**

ప్రకృతి బడికి, అరవింద స్కూలు వారికి, రిషివ్యాలీ స్కూలు వారికి, మన లైబ్రరీ వారికి, telugu4kidsవారికి, చిలిపిప్రశ్నల మూర్తిగారికి, 'విద్యార్థి' మాలతీకృష్ణగార్లకి, రాధా రాజశేఖర్ గార్లకి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచిపుస్తకం:

## విజ్ఞానశాస్త్రంతోవినోదాలు (Science can be fun)

"*ఈరోజుల్లో ఏదైనా పిల్లలకు బట్టీపట్టటమే అవుతోంది; కానీ బట్టీపట్టటం వల్ల పిల్లలు ఏమీ నేర్చుకోలేరు. పైగా ఊరికే విసిగిపోతారు. విజ్ఞానశాస్త్రం అసలైన ఆనందం ప్రయోగాలలో ఉంది. విజ్ఞానశాస్త్రం అనగానే అందరూ ఖరీదైన ప్రయోగశాలను ఊహించుకుంటారు. కానీ ప్రయోగాలు చెయ్యటానికి ఖరీదైన పరికరాలే అవసరం లేదు; పిల్లల విషయంలో మొత్తం ప్రపంచమే ఒక ప్రయోగశాల మాదిరి ఉంటుంది. పారవేసిన, పనికిరాని వస్తువులతో అనేక వైజ్ఞానిక ప్రయోగాలు చేయవచ్చు. మన చుట్టుప్రక్కల వస్తువులతో, ఆటబొమ్మలతో, దేనితో పడితే దానితో చిన్న చిన్న ప్రయోగాలు చెయ్యటంలోనే ఆనందం ఉంది.*

*ప్రశ్నలు వేయటం, ప్రయోగాలు చేయటం, పరిశీలించటం- ఇదే విజ్ఞానశాస్త్రం సారాంశం!*" అని రాసి ఉంటుంది దీని అట్టమీద.

పేరు ఇట్లా ఉంది కదా అని ఇదేదో మ్యాజిక్ పుస్తకం అనుకునేరు! కానేకాదు. పది రూపాయల ఈ చిట్టి పుస్తకంలో రెండో తరగతి పిల్లల సైన్సు పుస్తకపు సారాంశం ఇమిడి ఉన్నది. రాత్రులు-పగళ్ళు ఏర్పడటం దగ్గర్నించి, చెట్లు ఆహారం తయారు చేసుకోవటం నించి, మనం బ్రతికేందుకు కావలసిన పదార్థాల వరకూ చాలా మౌలికమైన అంశాలను ఆరేడు సంవత్సరాల పిల్లలకు పరిచయం చేస్తుందీ చిట్టి పుస్తకం. దీనిలో ఉన్న గీతల బొమ్మల్ని ఇష్టపడని పిల్లలే కాదు, పెద్దలూ ఉండరని మా నమ్మకం. మీరు చూసి చెప్పండి!

విజ్ఞానశాస్త్రంతో వినోదాలు

మన్రో లీఫ్

మంచిపుస్తకం-జనవిజ్ఞాన వేదిక ప్రచురణ (2004)

ప్రతులకు: మంచిపుస్తకం-9490746614



# ఏకీకరణం!

అనగా అనగా ఒక ఊరు.

ఆ ఊళ్ళో అందరూ **క** భాష మాట్లాడతారు. ప్రక్క ఊళ్ళో అందరూ **చ** భాష మాట్లాడతారు.

కొందరు తెలివైన వాళ్ళు **క** భాషా మాట్లాడే వాళ్ళు; **చ** భాష కూడా మాట్లాడేవాళ్ళు. వాళ్లని అందరూ గౌరవించేవాళ్ళు.

ఆ ఊరి ప్రక్కన ఇంకో ఊరుండేది. ఆ ఊళ్ళో అందరూ **ట** భాష మాట్లాడేవాళ్ళు.

కొందరు తెలివైనవాళ్ళు **క** భాషా మాట్లాడే వాళ్ళు; **చ** భాషా మాట్లాడేవాళ్ళు; **ట** భాష కూడా మాట్లాడేవాళ్ళు. వాళ్లని అందరూ ఇంకా చాలా గౌరవించేవాళ్ళు.

ఇట్లా ఒకదాని ప్రక్కన ఒకటి, వేరు వేరు భాషలు- **క** నుండి **అ** వరకూ- మాట్లాడుకుంటూ ఒక పధ్నాలుగు ఊళ్ళు ఉండేవి. పధ్నాలుగు భాషలూ వచ్చిన వాళ్ళకి అందరికంటే ఎక్కువ గౌరవం దొరికేది.

అయితే అవన్నీ నేర్చుకునేసరికి వాళ్ళు పాపం, ముసలివాళ్ళు అయిపోయేవాళ్ళు!

వాళ్లంత తెలివైనవాళ్ళు కావాలని పధ్నాలుగు ఊళ్ళ జనాలూ వాళ్ళ పిల్లల్ని పోరటం మొదలు పెట్టారు. ఎంత వేగంగా చదివినా, మొత్తం పధ్నాలుగు భాషలూ వచ్చేసరికి ముసలివాళ్ళు అయిపోతారు కదా?! అందుకని ఆ పని ఎవ్వరికీ ఇష్టం లేకపోయింది.

చివరికి ఈ పధ్నాలుగు ఊళ్ళకీ అవతల ఉన్నవాడికెవరికో ఒక ఐడియా వచ్చింది:

వాడొక **ఇ** భాషని కనుక్కొని, దాన్ని ప్రచారం చేశాడు: "**ఇ** భాష చాలా సులభం. అది **క** భాష వాళ్లకీ సరిపోతుంది, **అ** భాష వాళ్ళకీ సరిపోతుంది. ఎవరికి వాళ్ళు, వాళ్ల భాషతో పాటు **ఇ** భాష నేర్చుకుంటే సరి! "

అందరికీ ఆ పద్ధతి నచ్చింది. దాంతో ఏ ఊరివాళ్ళు ఆ ఊళ్ళో కూర్చొని, వాళ్ల భాష, దాంతోపాటు **ఇ** భాష నేర్చుకోవటం మొదలుపెట్టారు.

కొన్నాళ్లకు పధ్నాలుగు భాషలూ వచ్చినవాళ్ళంతా చచ్చిపోయారు. మెల్లగా 13 భాషలు వచ్చిన వాళ్ళూ పోయారు. 12 భాషల వాళ్ళూ పోయారు. అట్లా చివరికి రెండు భాషల వాళ్ళే మిగిలారు అంతటా.

కొంత కాలం గడిచిన తర్వాత కొందరు తెలివైన వాళ్ళు అనుకున్నారు- "రెండు రెండు భాషలు నేర్చుకోవటం కష్టంగా ఉంది, ఒక్క **ఇ** భాష ఉంటే చాలు గదా" అని!

ఆ విధంగా కొన్నేళ్ళ తర్వాత పధ్నాలుగు భాషలూ చచ్చిపోయాయి; ఒక్క **ఇ** భాషే మిగిలింది!!

పధ్నాలుగు ఊళ్ళకీ అవతల బంగళా కట్టుకొని కూర్చుని అందరికీ తన భాషను నేర్పిస్తున్న **ఇ** భాష వాడు అప్పుడు నవ్వుకున్నాడు, వీళ్లందరినీ చూసి.

మీకు తెలుసా, ఇలా ప్రపంచం మొత్తం మీద ఈ సరికి 2000 కి పైగా భాషలు చచ్చిపోయాయట, నిజంగా!!

Edited, Typeset and Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559 240222 E-mail: team@kottapalli.in.